శ్రీ ర స్తు.

శ్రీగణేశాయనమః//

# శ్రీ విభీషణ పట్టాభిషేకము:





శ్రీమచ్చిన దండ్లూరీశ్వరార్పితంబుగ

అబ్బరాజు వంశపయఃపారావార రాకాసుధాకరుండును

సుబ్బయామాత్య పుత్రుండును

శ్రీవత్ససగోత్ర పవిత్రుండును నగు

వెంకటశివకవిచే రచితమై

చెల్లగుర్కి గంగాధరశాస్త్రిగారిచే సరిచూడఁబడి

వేలూరు. కుప్పుస్వామి మొదలారివారిచే

అనారికిల్ డైమెండు ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

1924

# పీఠిక.

ఆర్యులారా?

విదేశీయులకు మనవిజేయు విజ్ఞాపన మేమనగా:—ఏను బాల్యదశయందుండి యీ గ్రంథముల విషయమునకు బోధయినవాడనుగాను గాన యీ నూతనమగు విభీషణ పట్టాభిషేకనాటకంబు జేయ ప్రయత్నించి యతిగణప్రాసలక్షణంబులు తగుమాత్రము దెలిసికొని శ్రీమాన్ మద్గురువగు యజ్ఞితాత కటాక్షంబున సర్వజనులకు మనోల్లాసంబుగ నుండునటుల రచియించితి. ఇక్కథయందు లోభాలోభములు గలిగినచో పండితవర్యులు నితరచదువరులు దీనియందుగల పొరబాటులెఱిగించుచు తమ పుత్రునిమాడ్కి నన్ను మన్నింతురుగాత:—

ఇట్లు తమవిధేయుఁడు,

వెంకటశివరావు.

జెల్లగుడ్డ

శ్రీ గణేశాయనమః.

# శ్రీ విభీషణ పట్టాభిషేక నాటకము.

---

శా. శ్రీరాధామణిమోవిచుంబనముతో శృంగారవక్షంబుపై
జారన్ పైటకుచంబులందుకొనుచున్ చెక్కిళ్లుముద్దాడుచున్
పేరాసన్ మిళిమిళ్లు వెంపొడలతో ప్రేమించుచున్ వెన్నుచున్
ఘోరారాకేళియు సల్పుచాడొసగుతన్ మాకిష్టసౌభాగ్యముల్.

గణపతి ప్రార్థన.



కావుము కరివదనా। గజానన॥ పావనమగునీ పాదములే నమ్మియు। భావములో నలనే భావించెద॥ కా॥ మూషకవాహన మునిజనవందిత। దోషపరిహారా। గజానన॥ కా॥ వాసిగశివకవి దాసునిదయతో। భాసు రముగ బ్రోవు। గజానన॥ కావు॥

శ్రీ విభీషణ పట్టాభిషేక నాటకము.

సరస్వతి ప్రార్థన.



క. భారతిపల్లవపాణీ, భారతిపరమేష్ఠిరాణి బంభరవేణీ
నీరదనిత్యానందని, శారదసంగీతవాణి సన్నుతిజేతుఁ.

పదం - రూపకం.

భారతి బ్రోవవే। పరిపరినిను స్మరియించెద॥ భార॥ కరుణానిధి శరణంటిని। మరువకను నిరుతమువో॥ భార॥ ఘనవాణీ అలివేణీ। వనజాసనురాణీ విను॥ భార॥ ముదమలరగ పాదంబులు। వదలకనే మది దలచెద॥ భారతీ॥

సేవకుని మాటలు. ఇచ్ఛగలిగిచ్చట ముచ్చటలరవచ్చి స్వేచ్ఛంబుగ లచ్చికన్న హెచ్చుగుమించి వన్నె చేమించు గలిగియున్న తా మెవరో తమ నామాంకితం బెఱిగింపవమ్మా తల్లీ.

శారద మాటలు. అప్పా మంగళకరమగు రంగు మంటపంబున శృంగారంబుగ మృదంగవాద్యగీతంబులిందునందముగ సుందరపాట లలితంబుగ ధ్వనులుప్పతిల చప్పుడు విని మనసొప్పినదాననై వచ్చియున్నదాన నానామాంకితంబు శారదయందురు వినరా సేవకా.

సేవకుని మాటలు. నమోనమః, ఈ మంటపమున నేడు శ్రీ విభీషణ పట్టాభిషేకము సకల జన మనోల్లాసంబు గలిగి నిర్విఘ్నంబుగ జరుగునటుల వరమొసగవమ్మా తల్లీ.

శారద. అదేప్రకారము నిర్విఘ్నముగ జరుగునటుల వరమొస
యున్నానికపోయివచ్చెద సేవకా.

సేవకు. పోయి రావమ్మా తల్లీ.

అనగా శారదతన నిజస్థానంబునకు జనును.




రావణుడు ఆస్థానము మంత్రి సేవకుడు,

ప్రవేశం ప్రస్తావన.

రావణుడు. మంత్రీ. ఈవఱకు యిటువంటి కార్యము మఱచి
వాడనైతి.

మంత్రి. ఇది యొక వింతగా యున్నదే నానాటి కెన్నడైనన
మఱచియుండు వారుగాదు అది యెట్టిదో వినినబాగు.

రావణు. ఆహా నాదేహామే మఱచినవాడ లేనిదే నటుగాకున్న
యిన్ని దినంబులు గడువ సీత సమాచారము యేల తలచువాడగాను

ఐనను యీ దినము స్నాన భోజనంబు దీర్చుకొని సుగంధ
పనభూషణా లంకృతుడనై జనివచ్చెదగాక.

రావణు. నిగనిగ మనుజగంబు వెలుగుచున్న తగుభూషణాద్య
లంకృతురాలవై స్నానభోజనంబు దీర్చుకొని. సీతచెంతం జనివచ్చుటక
చెలుల సహితంబుగ ప్రయాణంబుకమ్ము.

మండోదరి. పోయువచ్చెదము పదండి. అని అశోకవనంబునకు
జని సీతతో భాషించును.

రాగము - శుద్ధకాంబోది - పదం.

మానినిమిణి మానుమునీ। అనుమానము మానియునమకను గొనుమిక॥ మానినీ॥ ప్రీతిచేతను నతులితముగ యీతెరుణము। నేతీరునసీతానీ పతియీావల రాగలడిక మానినీ॥ మలినచేలముగా మది నొల్లక ధరియించుట। కేలానాగ్రృహమున బహుచాలాగల వాసగెద విను॥ మానినీ॥

మాటలు. నెలతా మలిన పుట్టంబెలకట్టి దిగులుజెంది యుండె దవు వాడిననుఖంబుచే చిన్నబోయి యుండుటెలనన్ను వరియింపుము.

అనగా శోకంబుచే.



సీత - సీసపద్యం - మధ్యమావతి.

సీ. ఎన్నడునేజూతు కన్నులారనునిన్ను నన్నుహింసించు రావణుడు నిజము.

మాటలు. అకటా నానాథుడగు శ్రీరాములకన్నులతో జూచెదనో జూడజాలనోగదా యీ పాపియగు రావణుని చెరయందు నేనేల జిక్కితి.

లేడికై నినుబంపి లేనికష్టంబులు పడుమని బ్రహ్మభావించెనేమో.

విభీ. కటకటా యిక్కాలంబునను పతిని బాసినదాననై వీనిచే జిక్కు జరుగుకేల వ్రాతవ్రాసిన బ్రహ్మతలచెనో యేమో.

శంకరాభరణ రాగము.

నాపుణ్యమిట్లుండ నేపుణ్యవంతులు తప్పించువారలు చూడజాల.

మాట. ఆహా! నా నోము ఫలపుణ్యమిట్లుండగా దీనిని తప్పించు వారెవరు.

చెలియలు నెవరైన చేసిన పాపంబు చేగుడుపుయనునది సిద్ధమిదియు

అయ్యో యెవరైన నిలయందు చేసినపాపము తమ చేతులార అనుభవించక తీరదనునది సిద్ధంబగు లోకసామెతగదా.

గీ. గాననివియెల్ల కనులార గనుచువినుచు
పతిని లేడికిబంపిన బాధగలుగు
ననుచు దెలియక నామూర్ఖతనమువల్ల
బంపితాఫలమును నేడుబడియవలసె.

అని యనుకొని రావణువంక దిరుగగా.

రావణు, మాటలు. ధగధగమని కోపంబు రగులుకొనగ దిగులుచే వగచెద వేల జగధీశుడగు రాముడీ యంబుధి దాటి నిచటికి జనుదెంచి రణరంగంబున నన్నుగెల్చి నిన్ను దోడ్కొని పోవునని యేల నమ్మెదవు ననుగూడి సుఖంబుగ నుందువురమ్మా కుందనపు బొమ్మా.





సీత - పదం - ముఖారి.

అసురకులాధిపుడవయ్యోయ్యానన్నిటులా। భాసురముగనీకు పలుకు టతగునా॥ అ॥ పాపియునీవునా పతిడాగురించియు। నేపునసీలంకా లో పలదెచ్చినక॥ అ॥ పరావధుమణిగోరు పాపాత్మునకును। సిరియునా యుకీర్తి చెడిపోగలదు॥ అసుర॥

మాటలు. రాక్షసా యిక్ష్వాకుకులసంభవుడగు రామక్షితీశుని నిర్లక్ష్యంబుగ లక్ష్యంబుంచక తక్షణంబున దుర్భాషలాడదగునా నిర్భాగ్యుడా అక్షీణబాణకోదండ భుజాదండమండిత ఖండలరిపు వేదండ కోదండాది దీక్షితుడగు రామ బాణాగ్నిచే దహింపంబడెదవు జడుడా ఖలుడా.

మండోదరి పదం - శంకరాభరణం.

వినుసీవునాథ విన్నవించెదనిక। వినవైతివేనినీకు యీవిరుబోణి శ్రోడ ప్రాణహానియుగను॥ విను॥ దానావకాంత లిందరుండగయీ। మానినీమణి సీతపై మమతేలనీకు లోకమాతయుగద॥ విను॥ అత డాదివిష్ణుశేటుల అవతారము। అవనీలో దశరథాత్మకుక। సుతుడాయె నిన్నుపోరి వధియించును॥ విను॥

మండోదరి - మాటలు. పొంకమగు పంకజాక్షులు మన లంక యందు నుండగ కొరతగలదా అందచందంబున యీ సీతలావణ్యంబు నన్నెందైన బోలగలదా పొగరుచే యీ తరుణీమణిపై విరహంబుగలి గిన అగడుగాదా నగరా మనోహరా.

రావణు - సీసపద్యం - శంకరాభరణం.

ముద్దుగుల్కుచునెమోవి నద్దంపుచెక్కిళ్లు మించుమలనాగారు కొలుగుమోము। మరువిరు పూచెండ్లు మానిని పాలిండ్లు అరవిందనేత్రముల్ లలరుకీవి। నిబ్బరంబగు నిసుక దిబ్బల పిరుదులు తోరంపు బాహువుల్ దొడలుయురము। తీరైనమృగనాభి దిద్దినతిలకంబు సింగంపునడుమును చెలిమిగలిగి। యుండు లావణ్యవతిపొందు నెచటగందు। అందమును మీరియుండు యీమందగమన। చందమునుగన్న నామది కుందికుంది। వెతలుజెందుచుయున్నది సతియునింకా.

మాటలు. ఇట్టి రూపవతియగు సీతను పొందకున్న నాగట్టితనం బేల నీయట్టి సతి బోధించిన నామది సంతృప్తి గలుగనేరదు నిక నూరకుండుమా మండోదరీ.

మండోదరి-మాటలు. అట్లులైన పలుమారు నే చెప్పుట వొప్పు దువా తప్పక నీ అనుభవంబు నీవే అనుభవించెదవు జూడుము నాథా.

అనగా సీతవంక దిరిగి.

నాతీ నీ యందంబునకు నింపొందు యిందువదన లెందు వెతికిన అందమేగాన స్పష్టంబుగ నిన్ను సృష్టించిన పరమేష్టిని నా యిష్టంబు దీరపదినోళ్ళచే వదలక దలచినముదంబుదీరునా సుదతీ లంకకీవల నీపతి యేతీరున రాగలడు గాన నగరికి పోవుదము రమ్ము సీతా.

సీత పదం - ఇంగ్లీషుమెట్టు.

శ్రీతర్వుతోడ వేము శంభుతోజోగి దాతాతోడ విప్రుధనికుతో పేదా॥ జాతీరత్నాము సరీగాజుపూసయు౯ భూతాలంబునాసరిబోల్చు కరణియు౯॥ శ్రీత॥

మాటలు. రాక్షసా వృథా యేల గర్వించెదవు శ్రేష్ఠమైన గంధపుచెక్కసాటి వేపచెక్కబోలునా దాతయగు వానితో ద్రవ్యము గలవానితో పేదవాడు సరిపోలునా గాన యా శ్రీరాములకు నీకు సాటి యెన్నటికైనా అగునా రావణా లోకవిద్రావణా.

రావ. నా బారికి నీ పతియగు శ్రీరాములు పారిపోక నిలుచునా తరుణీ రమణీ.

సీత - సీసపద్యం - మధ్యమావతి.

దనుజేంద్ర నీకన్న దగుదుర్బలుడుగాదు దైత్యులమర్దించు దైవ మతడు। వనవాసకృశుడు కేవలమానుడగు నేని ననదరాజ్యవిహీనుడైన నేమి। వొకలంక నేలుచు వొనరయుబ్బెదవీవు సకలలోకములకు స్వామి యతడు। రావణనీలావు రఘురాములావును నీవెచూచెదవింక నిశ్చయ ముగ। నతడె యీలంకదాటియు వవసరముగ। వచ్చి నీబంధువర్గంబు వరుసగాను। దునిమివైచును దుర్మార్గదురములోన। దెలియబల్కితి నీమది తెలియుమింక॥

రావణు. సీతా నన్ను బొంది సుఖింపుము.

మాట. ఓరి దనుజా పులస్త్య బ్రహ్మగర్భంబున నిర్భరంబుగ జనియించిన నిర్భాగ్యుడవై దుర్భాష లాడెదవా శంక లేక నిరాటంకం బుగ పంకజాక్షునండ నుండనీయక నీ లంకకిటు దెచ్చిన నెపంబున జెడుదు వికజూడుమా దుష్టాలోకపాపిష్టా.

రావణు మాటలు. హే కుటిలమతీ చటులతరపటుపటార్భటుల నిటల భ్రూకుటిల కటతటంబులదర తటాలున బలుకతినపుమాట లాడె దవు యింద్రాద్యష్టదిక్పాలకాది సురగరుడ గంధర్వ కిన్నర కింపురుష ప్రముఖాఖిల సమేతంబుగ నన్ను చేకొనదగిన మగధీరుడనై నీ కెర తునా నీ సుందరంబగు కందళిత హృదయారవింద కెందమ్మిరేకులబోలు కనుబొమలతీరుగని ముద్దుగులుకెడి మోముగల అందమగు నీ పొందు గోరిన వాడ యిందుకై సందియం బొందక సుఖంబు జెందుదువు గమ్మా సీతా భూజాతా.

సీత పదం - ముఖారి.

తెళియున్నాదనుజా తిళిమిక్కిల్లదమాతాడిది నీగతియుకుందేనో॥ హిందెనీమాడిదూదేనో । కేళుయిన్నూ నిన్నలంకా కెడువదీగా బంధు బళగా । వళెగెయల్లరప్రాణదహిసీ హోగువరునోడిన్నదురుళా॥ తళి॥

మాతుగళు.

నిమ్మమానినీమణి యరబిట్టు వనవాసమాడువ నన్నపతి రామ నిల్లదెవేళ దల్లికళ్ళ తనదిందయన్నన్ను యిల్లిగెతందు అల్లదమాతుగు ళాడిదకే ఫలవేను యిన్నుమేలె నిన్నలంకాపుర వెంబువను బాణాగ్ని యింద దహిసువను నోడోదురుళా.

సీతవంక దిరిగి

రావణు-మాటలు. యిప్పగిది తప్పకవొప్పనిమాట లుప్పతిలసీ చెప్పబకు సీతినే నొప్పదునా నిక్కంబుగ యప్పుడమిాశుని నెప్పు మాని నిప్పట్టణం బేలెడి గొప్పరాజగు నన్నిప్పుడొప్పి తప్పక నీ మను సొప్పగించిన గొప్పరాణి వగుదువు నట్లొప్ప వేని నిన్నిప్పుడే యిప్పరిఘా యుధంబుచే నీ తల వొప్పులగునటుల వేయుచున్నాను జూడుమా సీతా భూజాతా.

మండోదరి కేలిడుకొని పతినడ్డగించి

పదం - కాఫిరాగం.

చెలిసీతయుపై చంద్రాయుధమేయ చేతులెట్లాడును నామనో హర॥ పలుమరునిన్నన ఫలమేమియునిక కలుషమునెంచని వాడవై యిటు॥ అందముగను నేనుండగ నీమది కుందగకారణ మేలనో గద॥ ..ందువదననాసుందరమునుమిా రెండెననుసరిబోలునా॥ సరిబోలునా॥

మాటలు. ప్రీతిచే యీ సీతపై విరహంబున నేల తపించెదవు చక్కదనంబున నాకంటె యెక్కువగలదా వట్టిపాతక మేలగట్టుకొనెద విక నీ కోపంబు చాలింపుమా నాథా.

రావణు. ఛీ నా యెదుట పలుమా రిట్లాడుటకు తగదిక నూర కుండుమా మండోదరీ.

మండోదరి. ఇక నీ యిష్టంబు పొమ్ము ప్రాణేశ్వరా.

రావణు. హే త్రిజటా! హే అయోముఖీ! హే హేమాస్య! యీ సీతను రెండుమాసములలో నావశమగునట్లు మీరు బోధింపుడ టులొప్పకున్న తప్పక ఖండించి కండలు కల్లున నద్ది భక్షింపు డిక నే నగరికి జనెద.

రాక్షసస్త్రీలు. చిత్తము అనుచు సీతవంక దిరిగి.



సీ. అలివేణి నీవుమా అసురేశుడైనట్టి రావణునికపొంది రాణి వగుము। లావణ్యమునుగల లంకాధిపతిజూడు యింక యేమియుకొదువ యిందువదన। సురల నోడించిన శూరత గలవాడు దశశిరంబులవాడు దగినవాడు। పొసగ పులస్త్య బ్రహ్మపుత్రుడుజూడు వేదవేద్యుడు సిరియు వెలయువాడు. గీ. యిట్టివానిని గూడి నీయిష్టముగను। సలలి తంబుగ సంతోష మొందునటుల। నుందువోయమ్మ వినవమ్మ సుదతి మమ్మ। జాగుయేలను మనసొప్ప జానకమ్మ.

మాటలు. అమ్మా నీ పతియగు శ్రీరాముడు వనవాసంబున నుండ నీవిచట చెరయందుండుటకన్న మా రాజగు రావణుని బొంది సుఖంబు జెందవమ్మా సీతమ్మా.

సీత పదం - నీలాంబరి.

అసురేశూనిమాటలను ఆలించివింటిరేమీరూ ఆహా॥ యెట్లాడె మీకిటునోశూ॥ భాసూరాంబుగమీ భావముదెలిసెనచాలు॥ పర మానాపులనుభాత్రి భావంబుదలచినదానా పరబోధాలు నెన్నడు గానా ప్రాణా హానియును బాయకగల్గునుమీకు॥ అసురేశూ॥

మాటలు. ఆకఠినాత్ముడగు దశకంఠుని మాటలు విని మీరిట్లు బోధించిన ప్రాణహాని చేకూరును గాన నూరకుండుడీ రాక్షస కామినులారా.

చెలులు. అటులైన మేమిక బోధింపజాలమమ్మా సీతమ్మా.

చెలులు. హే అయోముఖి, హే వికటాస్య మన మిక కొంచెము సేపు నిద్రింతము రండు.

అనగా నిద్రింతురు కొంచెము నిద్రించి అంతలో త్రిజట తటాలున లేచి.

చెలియా యెటువంటి స్వప్నము గంటిని.

అయోముఖీ. అది యెట్లుండునో వివరింపుము.

అనగా త్రిజట బాగాకూర్చొని.

గీ. రాముడేనుగనెక్కి రాగలనుగంటి।
వెంట సౌమిత్రిభృత్యుడై వెడలగంటి।
కుంభకర్ణుండు తూరుపు కడకుబారి।
రావణుడుగద్దెపైబడు రవముగంటి.

ఆహా యిదియేమి చిత్రము. ఇట్టి స్వప్న మెన్నడైన నే గనినదాన గాను చెలియా రాము డేనుగపైనవచ్చునటులను లక్ష్మణుడు తనవెంట భృత్యుడై చనుదెంచునటులను కుంభకర్ణుడు తూరుపుదిశకు బారినటులను రావణుడు గద్దెపైనుండి క్రిందికి బడునటుల శబ్దంబు గంటినిగదా త్రిజటా.

చెలి. ముందు నీవెరుఁకపరిచితివి గాన నిక జాగ్రతగలిగి మనము యీ సీతకు బోధించగూడదు తెలియునా ఔనౌను నిజము ప్రమాదము అనుచు నూరకుందురు.

వనవృక్షంబున హనుమంతుడు ప్రస్తావన.



గీ. ఊరకుండుట నాకిక నుచితముగునె ।
రాక్షసుని చర్యగంటిని రామవైరి ।
నటులగాదేని నాచేత జచ్చునితడు ।
వీనితోడను నాకేల వైరమికను.

అని మది నూహించి.

మా.—నీపతియగు శ్రీరాములు క్షేమముగాయున్నవాడు దిగులు జెందవలదమ్మా సీతా.

అనగా విని పైకెగజూచుచు (సీత) తోడిరాగము॥

మ॥ కలయోరాక్షస మాయయోసితర సంకల్పార్థమో భావమో
స్థలమో నేమిప్రమాదమో మురిపెమో సంభాషచే కోతియుఁ
పలుకఁ గంటిని శాఖపైన నిచటఁ భావింపవేరెవ్వరుఁ
చెలువారఁ గమనించిచూడదగు యీచోద్యంబు నింపారగన్॥

మా.—ఐనను యీస్థళమహిమో లేక రాక్షసులమాయకాబోలు నటుగాకున్న యీతరువుపైన మర్కటంబు నాపతిగాను.

చారము దెల్పుట కారణమేమి నేటికి పదినెలలుగడచె కంటికినిదురయే గాన; నిందులనాకెద్దియు దోచదాయె మర్కట శకట మార్జాలమహిషంబుల కలలందు గనరాదుగదా నట్టికలయే యనుటకు నిదురించుదాననా! ఆహా! యిదివిచిత్రముగదా! యని తలవంచియుండగా.

రెండవసారి.—యొకపిపరుడు: క్రిందికివచ్చినిలిచి; వందనములు: తల్లీ! నీపతియగు రాములు క్షేమముగా యున్నవాడు; (అనగా - సుఖీభవయని; సీత-అప్పా!నీవెవరు? మానవభాషనే నుచ్చరించుచున్నావు.

ఆంజ.—నేనువాయుపుత్రుడు; నన్ను ఆంజనేయుడందురు.

సీత.—సరే; నిచటికివచ్చిన కారణం బేమి.

ఆంజ.—నీపతియగు శ్రీరాములవారి వృత్తాంతమంతయు నీకెరుకపరచెద;

సీత.—అటు లెరుకపరచుటకు యా రామచంద్రునకు నీకు నెట్లు పరిచయము.

ఆంజ.—మారాజగు సుగ్రీవుని చెంత మంత్రినై యుండగా; అట్టి సమయమందు; నీపతియగు రామసౌమిత్రులు మాల్యవంతమిడచి ఋష్యమూకపర్వతంబున కరుదెంచియుం డవసరంబున కిష్కింధనుండి మారాజాజ్ఞచే వారలకనుగొనిజని చెలిమిచే వారలసంప్రీతిగ దోడుకవచ్చి వారలకు మాసుగ్రీవునికి కిష్కింధయందె స్నేహంబు జేసితి.

సీత.—ఆంజనేయా; అటులైన వారల గుర్తులు కొన్ని చెప్పగలవా,

ఆంజ.—జననీ వినుపించెదవినుము; అవును; అనగా!

ఆంజ - సీ॥ రాగం-కన్నడ.

అందచందముమించి ఆనందమునుమించి అద్దంపు చెక్కుటద్దములవాడు। రవలంటుమురుగులు రంజిల్లుకర్ణముల్ మేఘచాయను బోలి మెరయువాడు । ఆజానుబాహువు లరవిందనేత్రముల్ విమల విశాలవక్షంబువాడు। ముఖపద్మమకరందమునకు వ్రాలిన తేటి కూనల బోలుముంగురులవాడు॥గీ॥యిట్టిరూపంబుగలవాడు యినకులాబ్ధి।సోముడతడును సౌమిత్రి సొబలుండు। నిన్నుదలచుచు నిద్రాన్నపానములును। విడచికలువరమొందునీ విభుడుజననీ॥

మాటలచే.—నిన్నువిడ నాడిననాటినుండి నేలపైబడి మూర్ఛ జెందుచు; హా! సీతాయని; దుఃఖావేశంబున పరితపించుచు నెపుడు చూచిన నీయందు ధ్యానవశుడై కలువర మొందుచుండును.

సీత.—అటులైనను! రామసౌమిత్రులు నేటివరకు క్షేమమున నన్నుమఱువనివారలై యుందురా ఆంజనేయా;

ఆంజ.—అవును; జననీ!

సీత.—నిన్నుఁజూడ చాలచిన్నరూపుచే యున్నవాడవు; యీ వార్థిదాటి యెటులవస్తివి.

ఆంజ.—నాకు కావలయునేని నాభుజసత్వబలముచే వాలంబు పెంచి నెగుగుసూల దేవతల ఆజ్ఞగలదు జననీ!

సీత.—నీమదితలచినవేళ పైపెంచుట వరంబుగలదంటివి యిపుడు నీనిజరూపుచూపుము; ఆంజనేయా!

ఆంజ.—గగనంబున రవిదాకు నటులనే పెరిగిన నొక నిముషమైన నీవు చూచెదవా జననీ;

సీత.—చూచుచున్నాను; అటులైన యిపుడె పెరిగెద!

అని పైపెంచగా.



సీత-క॥ చూచితి నీనిజరూపును
దాచియు నిక కొండ్దిగానుదగమునురూపుఁ
యోచింపక దాల్పుమునిక
నేచూడగ జాలమదిని నరుకయుగంటిక ॥

నికమునుపటి చిన్నరూపము దాల్పుము; అంజనేయా!

ఆంజ. —వందనములు; జననీ; సుఖీభవ.

రాములవారొసగిన యీముద్రికగైకొని మరల ఆనవాలొసగవమ్మా జననీ; తేవయ్యా ఆంజనేయా! అని గైకొని (కనులబాష్పధారలు నించుచు)

వ. యీ ఆనవాలును నీమొంబదట్టియందు గట్టిగా బిగియగట్టుకొనుము నిదిగాక నాపతియగు శ్రీరాములవారికి నామరదియగు సౌమిత్రికి మాఅత్తయగు కౌసల్యకు సాక్షేమం తెరుకపరచి నేనాడినదూషణ ఫలంబు లనుభవింపుచున్నానని సౌమిత్రియగు లక్ష్మణునికి దెల్పుము ఆంజనేయా.

చిత్త.— యికపోయి వచ్చుచున్నాను ఆజ్ఞయొసగుము జననీ ఆనవాలు యిదోగైకొనుమప్ప ఆంజనేయా.

తేవమ్మాజననీ; అనగా ముద్రిక నొసగును.

ఆంజ.—జననీ నొక సునవిగలదు;

సీత—అది యెట్టిదో యెరుకపరపుము; అనగా!

ఆ॥—క. అమ్మావనమునదండిగ
కమ్మనిఫలములును గలవుకడుయాకలిచే
సమ్మతిలేకనుయున్నది సీ
తమ్మాచేకొందునాజ్ఞ దయసేయగదె.

ఆంజ.—జననీ యిపుడాకలిచే డస్సినవాడను యీవనంబున రుచిగల ఫలంబులుగలవు అందులనొకటిని బుచ్చుకొనియెద; యిందుల కేమి ఆజ్ఞయో!

సీత.—అప్పా! లోకకంటకుడగు దశకంఠుని వనంబని నీకుం దెలియదా! అందులరాక్షసులు కావలియుందురు క్రిందరాలిన నొక ఫలంబు భక్షించిపొమ్ము;

ఆంజ.—చిత్తము; సెలవా; జననీ; పోయిరావప్పా;

అనగా వనమునకు ప్రవేశమై - ప్రస్తావన.

ఆంజ.—ఈ వనవృక్షంబులు నొక ముహూర్త మాత్రంబున శాఖలాకుల తీగెలు గెలలు పూలు. మొగ్గల సహితంబుగ ధరణికిబడ విరుగగొట్టి కాలువలు చెఱకుతోటలు మొదలుగాగలవన్నిటిని నిక పాడుచేసిన యీ రాక్షసులు నాపై యుద్ధంబు సేయతలంచి అడ్డమైన నొక్క పెట్టున చంపెదగాక యని వనములో;

సీ॥ పూదీగెలనువిరచి పున్నాగవృక్షముల్ నారికేళరసాలనాకు విరచి। కదళిఖర్జూరాది కపురపాటలవకుళ జంభీరఫలద్రాక్ష చెట్లు విరచి। నింబదాడిమపనస నేరేడుమారేడు కురువకురంటక కుదుళ్లు విరచి। గన్నెరులును మల్లికలువ పొన్నలుపొగడ మందారతరులును మొదలువిరచి॥ గీ॥ కాయమొగ్గలుపూత కాల్వలును జెరచి। ఆకుతీగల తోటలు అన్ని దునిమి। వైచినిలుచుండ వనపాలకులునుజూచి। వోరి నీ వెవ్వడప్రుయని వారలపుడు; నడుగా!

ఆంజ.—హేదానవులారా! నేను రాములవారిబంటును; నాపేరాంజనేయులు; మాదేవియగు సీతనెదకుటకై వచ్చినవాడ; యిపుడు మీ అశోకవనంబును పాడుచేసితిని; నికమిమ్ములవిడువక బొక్క పెట్టెద రారావరే!



రాక్ష.—మావనంబునుజొచ్చి తరువులిరిచి కొల్లలుబూడ్చితి విక యిదుగో నిన్నుబట్టి కట్టివేసుకొని మారాజుచెంతకు గొనిపోయెదము చూడరా; వనచరాధమా!

ఆంజ.—చిక్కితిరిక మీరెక్కడబోయెదరు బొక్కపెట్టుచున్నాను చూడుము; రాకుసులారా!

రాక్ష.—యిదో వచ్చియున్నవారము రా వనచరాధమ;

ఆంజ.—రారా వరే; అని వాలమునగట్టి.

ఆ-క॥ కొట్టితిదానవగుంపును । కట్టియునావాలమునను ఘర్జనతోడన్ ।
గట్టిగపుడమికిదట్టితి । బట్టియుకదలింతుబాగ పోయిరో లేదో॥

మాట.—వోహో! వీరలందరు హతమైపోయిరిక యింకానెవరు వచ్చెదరో జూచెదయని; తోరణస్తంభము బెరికి చేబూనియుండును.

రాక్ష.—వోరిడింభకా! వోరి మీననేత్రా! వోరికర్కటాండా! మనవారిలో కొందరు యీకోతిచేహతమైరి; మనమిక రాజగు రావణుని చెంతకుబోయి మనతలలుపగిలి కారుచున్న రక్తధార గాయంబులు జూపించెదము; రాండిరా వరే!

కొంతమంది పోయిదెల్పి వచ్చెదముపదండి; అని రాజుదగ్గర కెళ్ళినిలిచి.




రాక్ష-దర్వు - మధ్యమావతి.

బ్రతికివచ్చితిమీ । రావణమేము॥ బ్రతికివచ్చితి మిటులరాముల బంటునని నొక్క బక్కకోతియు। నతులితంబుగ వనముజొచ్చియు నంద

రిని బడదునిమెనయ్యో॥ ప్రతి॥ నారికేళములు । నరంజూరఫలములు నాకుఁతోటలును । పారుచుండెడికాలువలు జంభీరదాడిమ నింబఫల ములు । యేరులకు తెగవిరచివైచియు యేమినిలుపక పాడుజేసె॥ ప్ర॥

మాటలు.—అయ్యో; యెక్కడిదో నొక బక్కకోతివచ్చి మన వనముజొచ్చి తరువులవిరచి పూదీగెలాకు తోటకాలువలుబూడిచి పాడు జేసి మనజనంబులందరిని చంపివేయ మేము మెల్లగతప్పించుకొని రక్త ధారలగు గాయంబులు దుడుచుకొనుచువచ్చిన మాయవస్థ యేమని చెప్పుదుము రావణా;

అనగా రావణుడు కనులెఱ్ఱగచేసి కోపముచే పటపట పండ్లు కొరుకుచు.

వరె భటులారా మీరలా వనమునకుజని తప్పక యాకోతినిచ్చ టికి పట్టుకరండిరా వరీ;

రాక్ష.—ఆజ్ఞానుసారము వెడలుచున్నాము. అని వెళ్లి; వరేవన చరాధమా; నిలునిలు; అచ్చటి కిచ్చటికి కిచకిచమని గంతులేయుచు ఘక్కరించెదవా! యికనిన్నుబట్టి ప్రాణమును దీసెదము జూడరావరీ;



ఆంజ.—మీా రొప్పుటగని ముచ్చటలర విచ్చలవిడిగంతువేయు చున్నాను. యిక యీతోరణ స్తంభముచే మీా తలలువ్రతిల వప్పలు చేసెదనురండి రాక్షసాధములారా.

అని యుద్ధంబు బూని పోరాడుచు.

ఆంజ-క. చిక్కితిరిక మీరందరు
దక్కవుమీ ప్రాణములును దోరణస్తంభం।
చిక్కడ యున్నదినాచే
చక్కగ మీ తలలుబగుల చంపితినిపుడున్.

అని చంపగా;



మిగిలిన హతశేషులు తక్షణమున పారిపోయి రావణునికి దెల్పుదురు.

అంతట రావణుడు చింతాక్రాంతుడగుట జంబుమాలి జూచి.

జంబుమాలి.—రావణా చింతించెద వేల.

రావణు.—మన భటులలో పోయిన వారలందరా కోతిచేత హతమగుచున్నా రేమిచేయుదు.

జంబు.—యింత మాత్రమేనా సరె నేను వెళ్లి యీ కోతినిపట్టి తెచ్చుచున్నాను యాలచింతించెద వికమానుము.

రావ.—యీ దపా మీరుపోయి వచ్చెదరా.

జంబు.—యిదో యిపుడె వెడలు చున్నాము అని కొందరు ఆచటికి వెళ్లి.

వరె; వనచరాధమా!

ఆంజ.—నీ వెవ్వడవువరె తరెయని నిర్భయంబుగ వచ్చుచున్నావు;



జంబు - దరువు - కేదారగౌళ.

రారామరి పోరాడను ధారాళముగాను లేచి। వోరినాను బారికిసి పారిపోకునరాధమ॥ రారా॥ కెన్నాగానకిటులా మాదుకానానము పాడుజేసి। యన్నాహాని దానావ్రుల మెటూకునుజంపితివి॥ రారా॥ అంబూధియు దాటివచ్చి అవనిజతో మాటాడిన। డంభామణ గించాకున్న జంబూమాలి గాదునేను॥ రారా॥

మాటలు.—యిదుగో వచ్చియున్నాను నిక నీశూరత చూపుదువు రారా! వనచరాధమా;

అంజ.—నీ వచ్చుటకు కాచియున్నాను రారా వరీ;

రాక్ష.—వరె మనమంతగలిసి యీ కోతిని యిపుడె జంపుటమే లిక రాండిరాండి అని పోరాడుదురు;

అంజ.—రారా రాక్షసాధమా! వచ్చియున్నానురా వరీ;

జంబు-గీ. యనిలసుతునిపైన యేసినశరవృష్టి
గురియచాలనలసి కపివరుండు
తరువునొకటిబట్టి తలపైనవేయగా
జంబుమాలిజచ్చె జగడమునను.

కొంతమంది జంబుమాలిచావు చూచి.



రాక్ష.—అయ్యో జంబుమాలితో కొందరు యీ కపివరుని వల్ల హతమైరి. ఇక రాజు చెంతకీ వ్రంబుగజని దెల్పుదము రాండి రావరీ.

అని రాజునకు దెల్పుదురు.

రావణా మఱి కొందరు జంబుమాలితో గూడ హతమైరి మిగిలిన మేము వానిదెబ్బలకు తప్పించుకొని వచ్చినవారలము.

రావణుడు - ద్విపద.

యేమిసేయుదునింక నేమందువిధికి - కామిత ప్రభుడైన కపికుల మందు - వసరంగజనియించి వనచరుల్ పాలి - అనఘుడుబలశాలి యగు నట్టివాలి - సామర్థ్యమునునాకు సంగతిదెలుసు - యీమర్కటునియ వరు యిటుబంపినారో - వీనిబట్టుట కెవరు వీరులునికను - మనబంట్లలో గలరు మదినెంచిచూడా.

రావ.—హే భటులారా! మన బంట్లలో యీకోతిని బట్టుక వచ్చెడి శూరులెవరురా వకీ.

ప్రహస్తుని - దరువు - ముఖారి రాగము.

నసురనాథనన్ను బనుపుపోయివచ్చెదా॥ కపిని॥ జంపివేసెదా వేగపట్టి తెచ్చెదా॥ వశముగానివానరుణ్ణి వదలనియకనే। కసియుదీర బాగ కట్టి గడియలోనవచ్చెదర॥ వసు॥ యింతమందిగలిసిమేము యతనివిడు తుమా॥ ఆజ్ఞమీరినడుతుమా। నిన్నుచిన్నజూతుమా॥ పంతముననను వానిబట్టి పాపమనకనే। మంతనమున చింతలుడుగ మర్కటమును బట్టెదర॥

మాటలు.—హే రావణా! మేము కొంద రచటికి వెళ్లి యీ కోతినిబట్టి తెచ్చెదముగాన ఆజ్ఞయొసగుము.

రావణు.—నీవు పోయివచ్చెదవా ప్రహస్తా.

ప్రహ.—యిపుడెపోయి వచ్చుచున్నాను.

అని వెడలును.



ప్రహస్త-గీ. ఎవ్వడవురోరిసీపేరు యెరుకపరుపు
నెవరుబంపితెవస్తివ నబ్ధిదాటి
వచ్చినిటునందరినిజంపి వనములోన
పలుకకున్నావురమ్మిక బవరమునకు.

మాటలు.—వోరె మావనమంతా పాడుచేసి తోరణస్తంభముచే బూని మదించియున్నావు యికనాతో పోరుటకురారా వనచరాధమా.

ఆంజ.—నీకు పారిపోవు వాడగాదు రారావరె,

అని పోరాడుచు.

ఆంజనేయుడు.

పంచచామరము.

కదుర్ వడీర్ దడాబడాన కరములోర్ణ కంబమున్
నదుంబెత్తి నెత్తిపై ఫడామనగ వేయగా
ధగర్ గిరర్ బిరానరాక్షసుండు పైడిదిరుగుచున్
వరేవరే యటంచునా ప్రహస్తుజచ్చె వసుధపై.

కదుర్ వడీర్ మాటలు.—వరే నాపెట్టుకు నీయట్టివాడుచావక నిలుచునా అసురాధమా.

రాక్ష.—వరే వ్యర్థముగా మన జనమంతా వీనిచేత హతమైనది ప్రహస్తుడు మొదలైనవారు చచ్చిరిక మరల మనము రాజుతో విన్న వించుదము రాండిరావరీ.

గీ. అనుచుయీ రీతికొందరు అపుడుజనియు
రావణాసురమనజనము రాలిపోయిరి
గాననేమందునయ్యయో ఘడియలోన
కోతిచేతనుజచ్చిరి కొనువలేకా.



మాటలు. అయ్యో రావణా మనరాక్షసబలములో కొంత మంది యీకోతిచే మడిసిరి యిక మేమేమి చేయుదుము. అనగా;

రావణాసురు, మాటలు.—ఆహా యేమికాల మహిమో మనబల గము పోవడమెగాక మరల యీకోతిని జయించి పట్టుకవచ్చెడి వార లిచ్చట యవరు ధీరులు లేక పోయిరిగదా! యేమిచేయుదును; శోకింప పోనగువేళ వేసరికగొన్నతీరు నామంచిద యోచించెదగాక యని దిగు లుచేయుండగా రావణుచెంత అక్షయకుమారుడు నిలచి.

హిందుస్తాని - తమాష్.

జావరిజావో హామద్ సయ్యా తుంపవ్ వార్ నా రే। తుంకుభగ తుమే రాజుబులా వేరూపె అగర్ దీదా రెదిఖా వే। యిన్ దంకునియా డంకీటక్కర్ మాక్ నా రే॥

యాలయిలీలను చింతించుటనీ కేలమానుమూమదిలో। యాల మానుము వాలముగలిగిన వనచరాధముడు వనమునుజెరచీ వారిని జంపిన। చలమునువిడువక చంపుదువానీ నన్ను బంపుమా। రావణనన్ను బంపుమా॥

మాటలు.—నీవిటు చింతించుట కారణమేమి నాపరాక్రమం బున యీకోతినిబట్టి నీచెంతకు దెచ్చెద సెలవా! రావణా;

రావణు-గీ. వోరి అక్షయనీవక్కడ పనుదప్ప। మిగత వారలలో మేటిశూరులంత। అచటికపిచేత జచ్చిరి అందరికను। తక్షణము పోయి పట్టుకరమ్ము తనయా.



**మాటలు.** నీవక్కడవుదప్పు మిగిలినవారలందరా కోతిచే హతమైరిగాన జాగ్రతగా నీవచటికి జని యా వనచరాధము నిచటికి పట్టుక రారా తనయా.

అక్షయ. ఇపుడే పోయివచ్చుచున్నాను రావణా. అని యుద్ధంబునకు వెడలును.

గీ. ఓరివనచరుండ వచ్చితియుద్ధము ।
శేతురమ్మునికను శౌర్యమునను ।
పారిపోక నిలువు ప్రాణంబు దీసెద ।
నిన్ను బట్టి ...కను నిమిషమునను.

నరే నిన్ను చిక్కించుక బొక్కపెట్టెద యక్కడ కేగెదవు నిలురా నరాధమా.

ఆంజ. వచ్చియున్నాను రారా నరీ.

అక్షయకుమారుడు - క. అనగా అక్షయ సుతుడటు । ఘనశరములు వేయనలసి కపివరుడపుడున్ । తనవాలమునకు జుట్టియు । వనరుగ బడగొట్టెజంపె వసుధకువానిన్.



**మాటలు.** అక్షయ్యుని మిగిలిన రాక్షసులు తమ రాజు చెంత చెప్ప ప్రయత్నింతురు.

రావణా మన అక్షయకుమారుండు జచ్చెనని విన్నవించ రావణుడు కొంతదడవు చింతించుచు.

రావణు-ద్విపద. హేమంత్రిసామంత హేభటులార - నా మది యోచించ నాశ్చర్యమాయె - మనవారలందరు మడిశిరిజూడ - ఘను లెవ్వరునుయికను కనుబడలేదు - యింకజయోపాయ మెద్దియుగలదు - శంకరుచరణముల్ శరణంబునాకు - కపిచేతయీకార్యకాగలందులకు - విపరీతమైదోచె వినగనామదికి - దైవయత్నంబును దప్పించుటకును - యవరికినలవియా యెంచిచూడగను.

ఆహా దైవేబలే దుర్బలేయని—యీ కపివార్ధిదా టిటువచ్చి యింతటికార్యం బూహించి చేయుటకు నాకు దైవబలము లేక గదా. మంచిది అయినప్పటికి యోచించెద.

ఇంద్రజిత్తు. ఇంతమంది హతమైరి యవరిచే యీ కోతి చిక్కక యున్నది యిక తక్షణంబున నచటికి వెడలి పట్టితెచ్చెద రావణా.

రావ. నీవైనా పోయివచ్చెదవా.

ఇంద్ర. ఇపుడే పోయి వచ్చుచున్నాను.

అని వెడలును.

ఇంద్రజిత్తు. నరే వానరా.





పదం - భైరవిరాగం.

**నిలునిలు** రావణచరా ! నిలునిలు నీబ్రతుకు ముక్కలు విరచెద॥నిలు॥ ఘనమగువనమును ఘడియలో జెరచియు । వనపాలకులను వధియించిన నీవు॥ నిలు॥ నారికేళ ఫలనాములు నములుచు । పారిపోను నిలుపట్టెద నినునే॥ నిలు॥

మాట. ఓహో రాక్షసులారా అల్లదిగో అచట పారిపోవు చున్నది పోనివ్వకుము.

రాక్షసులు దర్వు - నాట.

పట్టుడీ యీకోతిని । పగ్గంబులతోడుత॥ పట్టు॥ పట్టుడీ మెడపట్టి నెట్టుడి దిట్టముగ బిగబట్టికట్టుడి॥ పట్టు॥ నిక్కిజూచుచుయున్నది । కనుబొమలు విప్పియు । కదళిశాఖల కెగురుచున్నదియు । వెక్కిరించుచు గ్రక్కునను మనదిక్కుజూచియు కక్కసంబుగ । చిక్కకను బలుదిక్కులెతుకుచు బక్కకోతియిదెక్కడిదాడీని॥ పట్టు॥



మాటలు. వరే చిక్కియున్నది బిగపట్టికట్టుచున్నాను యిపుడే మనరాజుదెగ్గర గొనిపోయి యీకోతిని తప్పకవప్పగించెద రాండిరా.

వచ్చుచున్నాము యిదిగో వచ్చితిమి పదపదా.

యింద్రజి. యీకోతినితప్పకపట్టి వేసుకవచ్చి యున్నవారము రావణా లోకవిద్రావణా.

రావణు. ఆహాచాలా సంతోషమాయె.

రావణు. ఆ-గీ. వోరినీవెవ్వడవు నీదుపేరుయేమొ । వనచరాధమనిన్నెవరుబంపినారొ । వార్ధిదాటియు నీవురావలయుశ్రీల। కారణంబేమిదెల్పుము ఖండితముగా॥

మాటలు. నీవీవార్ధిదాటి యేలవచ్చిమావనంబు పాడుచేయు చుకు నీవెవరో నామధేయంబేమో నిన్నెవరుబంపిరో దెల్పరావనచరా ధమా॥

ఆంజ-గీ. వినుమురావణు సేవింతవిశదముగను । నిన్ను రాముల బంపగ నిశ్చయముగా । నాంజనేయుడ నాపేరునందురిలను । సీతనిక జూడవచ్చితి శీఘ్రముగను.

మాటలు. నే నాంజనేయుడ యారాములవారికి బంటునై సేవనంబున వైదేహిని వెదుకుటకై వచ్చియున్నవాడ రాక్షసాధమా.

రావణు. వరేనాకంటె యెక్కువగా కూర్చునియున్న కారణమే మిరావన చరాధమా.

ఆంజ. నీకంటెనేను తక్కువేమిరా రాక్షసాధమా.

రాక్షసు. హారావణా యీవనచరాధముడు సీతిచెంతకుజని కొంతతడవు నచటయేమేమొముచ్చటాడి గచ్చుబల్కి నచటనుండిమ నవనంబు ప్రవేశించి ఆకుతోటలంగూర ఫలంబులు కాలువలు చెరచి పాడుచేసిమన వారినిజంపిన యీకోతినిను దండనముగదండన చేయవలె మహాప్రభో.

రావణు. వరే యీకోతి బలుధిక్కరించుచున్నదిక వీనివిడువక బట్టిచంపుమురా భటులారా.



రాక్షసు. చిత్తము యిప్పుడె చంపివేయుచున్నాము.

రాజేంద్రా. హా హా నిలునిలు మనుచునడ్డమై.

విభీషణుని దరువు - మోహనరాగం.

భూపాలచంపుటమేలా । పాపంబుమనకదిచాలా॥ ఖండింపమది నిమూని । దండింపతగునుగాని । యీకోతివాలముబట్టి । కోకాలుగట్టిగజుట్టి । తైలంబుముంచినగ్ని । కీలాలగాల్చుటచాలు॥ భూపా॥

**మాటలు.** అయ్యోయిచటికి వచ్చినదూతను చంపుటనుహాపాతకంబు అటుతగదుగాన యీకోతివాలమునకు దండిగాబట్టలు జుట్టి తైలంముంచి కాల్చివేయుట చాలునన్నా రావణా.

రావణు. అటులనే గావించెదనిక విభీషణా.



ఆంజనేయుల - ద్విపద.

కోరనివికవినుము వానరగసీకు - నోరూరదెల్పెద నోరిరాక్షసుడ- రాముడేలరనీకను రణమునజంప - కోమలియు సీతకోపంబేచాలు- యీలదెస్తపి గోరియువివేకమునను- నిలంకచెడ్డిపోవు నికశిద్ధమిదియు- వాలినిగర్వంబువనరు గాసణచె- చాలకదేవతా సఖులనుచెరచి- నట్టివానివినీగు నన్యాయమంచి- గట్టిగానిలంకగాల్చి పోవాడ.

**మాటలు.** వగే నీవు యింకా కొన్నివర్షంబులు యీలంక యేలుటనీకు ప్రాప్తిలేదుయిక నీవుచెసుటకు సందియంబు చూడరా రావణా.

రావణుండు. వరేవీనితోకకు నికఆలస్యంబు సేయకమనగృహములయందుండువస్త్రంబులు దెచ్చిబాగావాలంబునకు జుట్టితైలధారలచేముంచి అగ్నిఅంటించుము బటులారా.

రాక్షసు. తనుఆజ్ఞాను సారంబుగ అట్లనే జేయుచున్నాము రావణా.

భటులు. వరేయికన్ని గృహములలోనుండు పాతచింపిరిగట్టివస్త్రంబులు వెతికిదెత్తము రాండిరావరే పదండిపదండి అనివెళ్లుదురు.

రాక్షసు. వరేయిదుగో యీగుడ్డలు మిగులనివ్వక బాగా గట్టిగాతోకకుచుట్టుము రామక్కటాండా తేరావరే అనివాలంబునకు చుట్టుదురు వస్త్రంబులుచాలవు మరికొన్ని దెమ్ము వరేయిన్ని వస్త్రంబులు దెచ్చినట్టిన్నితోకకు చాలకనేయున్నవి యికకొంచెము వాలముస కుతక్కు వమైదోచుచున్నది యిందుకేమి చేయుదముమన రావణునికి జెప్పుదము రాండిరా వరే.

భటులు. అయ్యోయిదెక్కడ కోతియోయిన్ని గుడ్డలైనచాలకనేయున్నవిక యేమేమిచేయుదము రావణా.

రావణు–గీ. సీతచీరమైన శీఘ్రుంబుగాదెచ్చి। గట్టుడింకతోకబట్టి మీరు। మోచనేలమీకు మోరోరిభటులార పొండివనమునకును తెండిమీరు.

మాటలు. నికశీఘ్రుంబుగవనంబున కెడలిసీతయొక్క చీరమైనను దెచ్చిగట్టుమురారావరే భటులారా.

అనగా వాలంబు ముడుచును.

భటులు. యిప్పుడుసరిపోయెనిక తైలంబులో ముంచుదువురా రావరే ముంచుదమురమ్ము అనిముంచుచువరే యింతట యీకోతినిక విడువవలదు వీధులు వీధులు త్రిప్పవలెరా వరీ.

అవును అవును యీ కోతిని పగ్గములచే పోనివ్వక పట్టి అగ్నిదగిలించుము.

ఆహా మండుచున్నది చూడరా వరే.

అనగా తోకను గృహములోకిజేర్చి.

ఆంజనేయులు – లావణి – రీతి – భైరవిరాగం.

రావణా యిపుడేమందువురా॥ అయ్యో॥ రావా॥ నీవారాలందారునేమైరో॥ కాలాగ్నిలోన॥ రా॥ శృంగారామేడాగోపురములు।

భంగామైభవనంబుల్ పొగచేతాపురమంటుకొనెను॥ రావా॥ నేనెవరో గుర్తైనాదెలుసూనా। నేనెశ్రీరామూలానెచ్చైనాబంటునురా॥ రావా॥

మాటలు. ధగధగమని పొగలెగయుచు రగులుకొని పురమంత నంటుకొని యీ కంటకులగు దానవులు హతమైపోయిరి యిక చాలును శీఘ్రంబుగ వార్ధికెగరి నా వాలంబు చల్లార్చెద.

యనుచు జని జలంబులో ముంచుచు.

వేరొకప్రస్తావన దలచి దీనుడై.

ఆ-వె. ఔర యీలంకగాల్చితి అవసరముగ । సీత యేమా యనోగద చిచ్చులోన । ప్రభువు యీమాటవిన్నను ప్రాణమిడుచు । గాన వైదేహినికచూడగలనొ లేదొ.

మాట. ఆహా యీరగులుకొనిమండెడి చిచ్చులో సీత యేమా యనోగదా యంత వెఱ్ఱినైతి నికనైనా శీఘ్రముగా పోయిచూచెద.

అని లంకలో వాలంబు సముద్రములోపల జేర్చి కూర్చొని ఖిన్నుడై యుండగా.

దేవదుందుభులు భేరీశబ్దంబులతో గగనంబున.

ఇంగ్లీషు ఘనసట్టిమెట్టు వరుస.

యనిలతనయనీవు మదినియోచనేలను । జనుముసీతవనములోన క్షేమముగనుయున్నదయ్యా॥ యనిలత॥

మాట. ఆంజనేయా సీతాదేవి వనములో క్షేమమే.

ఆంజ. ఆహా సంతసించితి మా తల్లియైన సీత క్షేమముగా యున్నది కాబోలు లేనట్లైన యీ దేవదుందుభులు శబ్దంబులేల జేసెదరు. అయినను వనంబున కిఖ లంఘించెదయని నచటికెళ్ళి.





ఆంజ. తల్లీ వందనములు. సుఖీభవ చల్లగా స్థిరంబుగ వర్ధిల్లుము. యిక పోయివచ్చెద నాజ్ఞయీ.

సీత. అప్పా నా నాథుడగు శ్రీరాములు యింకొక నెలలోపల వచ్చి యీ దుష్టుని వధించి నన్ను గొనిపోయెనా సరే లేనిపక్షమున యీ కేశంబుల నురివేసుకొని చచ్చెదనుము సిదిగాక మున్నరణ్యంబున నా తొడలపై యీ రాముడు పవళించియుండ కాకంబొకటి జను దెంచి నా స్తనంబుగ్రుచ్చిన రక్తంబులొలుకగా తక్షణంబున బ్రహ్మాస్త్రం బిడువ నది త్రిలోకంబులందెల్ల దిరిగి పునహా కావుకావుమని నృపతికడ రాగా నపుడు నే నేత్రం బొకటి యీ శస్త్రంబున కాహుతి నొసగెద నీకొకటియే చాలునని దెల్ప నది శరణాగతయై వేడుకొన నా శరీరంబు నిష్ఫలంబుగాదని విన్నవించిన యీ గుర్తొకటి దెల్పుము. మా యిరువు రికి వినహా నెవరికి దెలియజాలదు గాన యీ సంగతి కెరుగింపుము నిక పోయిరమ్మా ఆంజనేయా.

ఆంజ. తల్లి నా భుజంబులపై నిన్ను నిమిషంబున దోడ్కొని పోగలవాడ రమ్ము.

సీత. అటు నే నొంటతటయగును నతనివల్ల నేను రాగలను గాన నీవు పోయిరమ్ము.

అనగా చిత్తము యని మరల వార్ధిలంఘించిపోవును.

శ్రీ

# ద్వితీయాంకంప్రారంభము.

వారధిఆవల అంగదజాంబవంతాదులు.

జాంబవంతుడు-గీ. పవనతనయ నీవుపోయిన కార్యంబు। యెట్టు లాయనదియు నెరుకపరుపు। నీవునచ్చుదాక నిచటయున్నారము। సీత సుద్దివిందు సుందరముగా.

మాటలు. ఆహా నీవునచటికిజనినకార్యంబు వివరింపుము.

ఆ- గీ. జాంబవంత నేను జాగ్రతగాబోయి। సీతనచటగనియు క్షేమమెరిగి। వనముపాడు జేసివనపాలకులజంపి। లంకగాల్చి. వస్త్రిసింకజాడు.

మాటలు. జాంబవంతా సీతాదేవిక్షేమమే లంకనుగాల్చిన పొగమంట లెగయుచున్న దల్లదిగో చూడుము.

జాంబ. వోహో రాక్షసుదు హతమైయుందురుగదా.

ఆంజ. యింకా యోచించెదవా జాంబవంతా.

అంగదాదులు. ఆంజనేయాని కమనమంతగలసి మధువనంబునకు బోవుదము రమ్ము





ఆంజనేయ. పోవుదము పదండి అని వెళ్లుదురు.

క. అనివనమునకుఁ జని । యనిలసుతుం జాంబవంతుఁ డంగదనీ
లు ।। డనువారలెల్ల ఫలముల । ఘనతరువులపైకి జనిరి గంతుల తోడన్.

వారలొకరికొకరు గంతులు వేసుకొనుచుందురు.

దధిముఖుడు. అనఁగా వనవానరులు జూచి.

ఓరేకుప్పగంతులచే వనమెల్ల దిరుగుచు ఫలంబులు రాల్చుచున్న మీరెవరు మా రాజుచే మాట వచ్చును యిచటనుండి తొలగిపోయెదరా లేక దెబ్బలు కావలెనా అని గట్టిగ వదరుచు వచ్చెడివారలజూచి.

అంగదాంజనేయుడు. ఓరేమా జోలివచ్చిన మీకొవ్వణగించి ప్రాణంబు దీసెద యీసమాచారము మాపైన మీరాజునకు దెల్పుమని నోరెత్తక పొమ్ము.

దధిము. ఓరేతరేయసి దూరుటకు నీయబ్బగంటున్న దావనంబు దాటిపదాఛీ తెలివిలేని మూఢులారా.

ఆంజ. ఓరే పసకిరానికూతలు కూసెదవా మాదెబ్బకు మొబ్బదగిలి దబ్బున మీ యబ్బకు చెప్పిన దిబ్బలపై బడి పొర్లాడునటుల నిపుడే నీ ప్రాణంబు దీయుటకు సిద్ధంబై యున్నవాడ. రారా దురాత్మా.

దధిము. వచ్చియున్నాను రారా వనచరాధమా.

క. అని దధిముఖు శిరముపయిన్
ఘనతరువును బెరికివేయ గ్రక్కుచు రక్తం ।
బును దేహముపై గారగ
జని సుగ్రీవునికి దెల్ప చయ్యన నటులన్.

రక్తగాయములు దుడుచుకొనుచు నేడ్చుచు సుగ్రీవుని చెంత.

మాటలు. ఓరయ్యా యిది యేమన్యాయము నేడు మన వనంబున కపిగుంపువచ్చి చెట్లపైకి గంతులచే నెగురుచు ఫలంబులు రాల్చుచుండగా మీరెవరు యిటువనంబు పాడుచేయుచున్నారు మా రాజుచే మాట గలుగును నిక తొలగుదురా లేక మీకు దెబ్బలు కావలెనా యని మేము బెదరించగా వారలంగద నీల జాంబవంతాంజనేయులము మేము కావలసినవారలైతే మీ రాజుకు దెల్పు పొమ్మని మమ్ముల కొట్టిన రక్తగాయంబులు చూడుము రాజేంద్రా.

అనగా శ్రీరాములు సుగ్రీవుడు నవ్వుకొనుచు.

మాటలు. దధిముఖా వారెవరుగారు మనవారలు లంకాపురి గాల్చి వచ్చుమార్గంబు చాతుర్యాసమున మన వనంబు జొచ్చియున్న వారు గాన నిక వారితో మీకు వైరంబేల పొమ్ము.

అనగా చిత్తము అని వెళ్ళుదురు.

ఆంజ. జాంబవంతాంగదులారా యిక మనము శ్రీరాములవారి చెంతకు పోవుదము రమ్ము అని వెళ్ళుదురు.

రాము. ఓహో ఆంజనేయులు వచ్చుచున్నట్టులున్నది సుగ్రీవా.

సుగ్రీ. అవునుగదా రామచంద్రా. అనగా వచ్చినిలచి.

రామసుగ్రీవులకు. వందనములు అని కరంబులు మొగిడ్చి నిలువ.

రాములు. ఆంజనేయా నిన్నుచూడ మ[illegible] సంతసంబు గలుగుచున్నది. అచట వృత్తాంతమేమి. అనగా



ఆంజనే - పదం - శుద్ధకాంభోది.

కనుగొంటిసీతను దశకంఠునికాననమున - శ్రీ - రామా॥ గృహములు వెతికితి - రఘు - రామా॥

దానవనాథుని తగుబంట్లందరు దండిగ నాపై రాగా - వారల చెండితి ధరణికి - బాగా॥ క్షేమమును నే దెలుసుకవచ్చితి తామికదయ సేయండీ - శ్రీరఘుపు-సేతువగట్టండీ॥ మనమున సంతస మొందగ జేసియు ముద్రికనే - నొసగీ - నిజముగగగనమునకు - బెరిగీ॥ మానిమునుపటి రూపముదాల్చగ - అనఘాలోని సెగ ॥ క్షేమముమీకును దెల్పను వెళ ॥

మాటలు. సీత క్షేమముగా యున్నది వకనెలలోపల మీరు అచటికిపోతిరా సరే లేనిపక్షమున కేశంబులచే నురివేసుకచచ్చెదనని నింకా నొక గుర్తే మనమున్నరణ్యంబున కాకాసురుని ఆనవా లొకటి మా యిరువురకే దెలుసును గాని యితరులకు దెలియనేరదు గాన యీ గుర్తొకటిదెలుపమని మరల ఆనవా లొసగియున్నది గైకొనుము రామచంద్రా.

తెమ్మా ఆంజనేయా.

అనగా నొసగును.

రాములు ముద్రికతన చేతులనుంచుకొని శోకించును స్వగతం.

ద్విపద. పోయితే భూజాత పోయితే నెలత - పోయితే హా సీత పోయినజాడ - ఏయడవియుందువోయని నిన్ను వెదకి- బాయకనిన్నుంచి నట్టియాపురము - నెరుగజాలక నేను నెదుకపంపగను - మారుతాత్మజు చేత మర్మంబుదెలిసె - యికవచ్చెదనువార్ధి యావలగడచి - నొకనిమిషంబైన నోర్చుకొనజాల్క దుష్టునివధియింతు దురములోపలను- కష్టంబు దప్పించి గైకొనివత్తు.

మాటలు. హా సీతా నొకనిమిషంబైన యాలస్యంబు గడుపువాడగాదు నిక శీఘ్రంబుగవచ్చెద అని.

రాములు. సుగ్రీవా సేతువగట్టుట కెవరు సాహసులు.

సుగ్రీ. మున్ను దేవసమానమగు రుషులచేత వరముగొన్న నీలుడనువాడు గలడు అతడు రాళ్ళైనను సముద్రంబున పారవైచిన మునుగక తేలునుగాన అతని కాజ్ఞచేసెద.

రాము. శీఘ్రముగ బిలువబనుపుము.

చిత్తము అని.

సుగ్రీవు. అంగదా నీలా మీరు యా నీలుని నిచటికి బిలువుము.

ఇచటనే యున్నవాడు సుగ్రీవా.

సుగ్రీవు. నీలా మన రామకార్యార్థము నిక సేతువ గట్టుటకు సాహసవంతులలో నీ వకడుదప్ప మిగిలినవారు రాళ్లు కొండలు మొదలైనవి సముద్రంబునవేయ మునుగును గాన నీవు ప్రయత్నపడుము.




సిలుడు. చిత్తము అనగా.

సుగ్రీవు. రామచంద్రా యీ సుముహూర్తంబున సేతువకు ప్రారంభించునటుల గావించెద.

తథాస్తు గానిమ్ము.

రాములు. సుగ్రీవా సముద్రుని దారి విడువమని నడుగుము. చిత్తము.

రాములు. యీ సేతువముగియువరకు ౩ దినంబులు వుపవాస ముగడుపువాడ. చిత్తము.

కపులు. సముద్రమహారాజా శ్రీరాముల కార్యంబునకు సేతువ గట్ట ప్రయత్నించెదముగాన నీవుదారినొసగుము.

సముద్రుడు. ఆహా నేనుమీకుదారి నొసగిననావు దరమంద నేకజీవ రాక్షసులు జంతువులు అన్యాయమైపోవునుగాన నేనుదారివిడుచుట కనుకూలముగాదయ్యా సుగ్రీవా.

సుగ్రీవు. నేటికి ౩ దినములాయెను శ్రీరాములవారు వుపవాసమునన్ను ధారినడుగుచున్నారు గానమామనవివినుము వారధిరాజా.

సముద్రుడు. వోసహా నేదారివిడుచుట దుస్తరముగాన అడుగవలదు.

శ్రీరాములవారు కనులెఱ్ఱగజేసి లక్ష్మణునితో
అడుగవలదు నూరకుండుము సుగ్రీవా అనుచు
లక్ష్మణుని వంకదిరిగి.

దర్వు - శుద్ధకాంభోది

రా॥ బాణమూను దెమ్మాతడో ణీగూల్తువీసి॥ స్థాణుబ్రహ్మాసు పర్వాణూలాగాచీనా॥ బాణ॥ లక్ష్మణావిడుయూ వృక్షచారూలను। తీక్షణాస్త్రమూనా యీక్షితిగూల్చేదా॥ బాణ॥

మాటలు. యీనాటికి మూడుదినములు గడిచెవీని నెంతప్రయత్నమున నడిగినప్పటికి మనసుకు రాకయున్నదిగాన యీసముద్రునితల ద్రుంచెదనికి యీబ్రహ్మాస్త్రం బందుకొనుము లక్ష్మణా. అనియెక్కు బెట్టి వేయుబూనును



సముద్రుని - దర్వు - భైరవి.

అపరాధిని నెపమెన్నక కృపజూడుముకరుణానిధే॥ వుపకారము నేజేసియు। యిపుడేనె తెరవొసగెద॥ అప॥ చాలింపుము భూపాలక। కాలాగ్నిగ బ్రహ్మాస్త్రము। యీలాగున నీవిడచిన। జలజంతువులుండవునిక॥ అప॥

మాటలు. నేనిపుడే తెరవొసగితి నికనాపై అపరాధమెంచక క్షమింపుము రామచంద్రా.

రాము. సముద్రానాచే విడువబడుబ్రహ్మాస్త్రమువృథాపోవునదికాదు గానసికనిర్జరభూములపై ప్రయోగించెద.—— అని వేయును.

రాము. సుగ్రీవాంగద జాంబవంతులారా నికశీఘ్రంబుగ సేతువుగట్ట నారంభింపుము.

చిత్తమునని. కట్టుటకుప్రయత్న పడుదురు.

అంగదు. హేసుషేణ నేలజాంబవంతులారా మీరుగొప్ప తిప్పలు మొదలుగాగల పర్వతంబులు జాగ్రతగా తెమ్ము.

తెచ్చుచున్నాము.

క. అనిఅంగదుకును నలుడుండ్ !
ఘనపర్వత శిఖరములును కరములంగొండ్ !
వనువుగ నతిశీఘ్రంబున !
కనుగొనుటకు సేతువపుడుకట్టిరి వారల్.

జాంబ. నీలా యిక్కడికి సేతువుముగిసినది గదా.

నీలు. అవును పూర్తిముగిసినది.

దరువు - కాంపిరాగం.

రామాలక్ష్మణులూవచ్చిరి। సుగ్రీవుని కడకిటు॥ రామా॥ రామలక్ష్మణులు రవితేజులుబల్। భీమపరాక్రమ బిరుదుగలిగినట్టి॥ రామా॥ పాతకుడగు దశకంఠ పురముజేర। యీతరుణమునను సేతువజూడను॥ రామా॥

రామ—— సేతువ వంకదిరిగి.

హేకపులారా యీసేతువను చూడగానామదికి చాలాసంతోషమాయె——

అంగదు. కపులారామనమింకొకసారి అంతమందిపోయి లంకాపురముజూచి వత్తము॥ అవును హాస్తవముగా పోయిరా పలయును అంగదా.

ఆంజనే. రామచంద్రా నికమనములంకలోపల ప్రవేసించుదమా॥ రాము॥ కపులందరు కలిసినావెంట పోవుదమురమ్ము॥ చిత్తము॥

రాముల - దరువు - ముఖారి.

కపులారా నావెంటాకలసి రాండికమీరు। యిపుడూయీసేతువపైయిటునటు మీరెగరాడక॥ కపు॥ ఆలస్యామేలగు ఆలంకాపురిజేరియునిక। ఖలుడైనా రావణునిఖండించక మానుదునా॥ కపు॥

మాటలు. కపులారా జాగ్రతగా లంకాపురంబు ప్రవేశింతమురమ్ము.

కపు. వచ్చుచున్నాము మీవెంటపదండి రామచంద్రా.

అని లంకప్రవేసించి అచట నొకస్థలంబునదిగియుండగా.

రావ. మంత్రులారా యీరామభూపాలుడు కపిసేనతో వార్ధి దాటి మనలంకజొచ్చియున్న వారలిందుకేమియు పాయముచేయుదము.



రావణుని ముందర - రాక్షసులు - శుద్ధకాంభోది

రావణాభయమేలను । రాముని ఘోరణమును నికమానుదుమా॥ కడనుందుమ॥ రావణా॥. శత్రురమునమనుజూచియు చిత్తరపడి చత్తుగనిక॥ రావణా॥

మాటలు. మేమందరము సిద్ధమైయుండ నీవుభయ పడుటే లరావణా.

యింద్రజిత్తు. రావణానేనును ప్రహస్తుడు నూర్ధ్వజంఘుడు వజ్రదంతుడు దేవాంతకుడు పంక్తిరోముడు సర్పరోముడు యింతమందిగలశియా రామకపిసైన్యంబు పైకిపోయివచ్చుచున్నాము రావణా.

అనుచుండగా

విభీష - దర్వు - బంగాళతోడి - రాగం.

అన్ననాదూ చిన్నమనవి - ఆలకించా- వన్న- మదికీ- విన్నవింతు- విశదముగను- వీనులతోనీ వినుమునికను - మెన్నసాటి- నీకురాములకేమి పనునీబోలగలవు॥ అన్న॥ అతడేవిష్ణు- డతడేదేవు డతడేవైవామనుచు దెలియు। అతనిగెలువానలవిగాదు అసురనాథావైరమేల। హితవు తోడసీత నొసగినతులితముగా శరణువేడా॥ వన్ననా॥

మాటలు. అన్నా నామాటలువిన్నశేయక క్రన్ననికసీత నొసగిశరణని వేడినమనలమన్నించి రక్షించునన్నా రావణా.

హాదుర్మార్గాయని పండ్లుకొరుకుచు కనులెర్రంజేసి అతనివంక జూచుచు మంత్రులతో.

రావ-గీ. మంత్రులార ఏసిమాటలువింటిరే। తమ్ముడనుచుని కనుతలపదగున। నాదువైరితట్టున్యాయంబు చెప్పును। గానవీనితందు కాలికొద్ది.

అనిఖడ్గంబుచే బూనితన్నగాగద్దెపైనుండి క్రిందపడ.

మాటలు. ఛీ నికృష్టాత్ముడగు భ్రష్టానికనాయెదట నుండతగదీ పురంబుదాటి వెడలుము లేకున్న యీఖడ్గంబుచేతనీయులు చేసెదచూడరాద్రోహి.



విభీషణుని - దర్బా - మిత్రపల్ భాగం.

తప్పేమిజేసితిని। దానవనాథా॥ తప్పే॥ తప్పేమిజేసితి తప్పాక దెల్పుము। గొప్పాతప్పైనను యిప్పుడేవొప్పిద॥ తప్పే॥ యిమ్మహా రామాభాణాము నీరొమ్ముదాకి। నెమ్మోములువిరిగిన తమ్ముడవం దానన్న॥ తప్పే॥

మాట. నీకిపుడే చేయరానితప్పు నీ జేసినట్టుదోచిన యీ పుర మిడచి నీక వెడలెదగాని గారంబున యీ రాములశరంబులు నీ యురం

బున దాకి శిరంబులు ధరణికి బహువేళనైనా తమ్ముడా నిచెప్పబడు వాక్యంబులకు నేనొప్పక నిను తన్నితిగదా యని అప్పుడైనా నీమనం బునకు తలచుకొనిమెదవు జూడవన్నా రావణా.

రావణా. భ్రష్టా నిక నోరెత్తకపొమ్ము.

విభీ. చిత్తము అని తల్లి దెగ్గర వెళ్ళి నిలచి.

మాట. అమ్మా జననీ.

కైకేసి. యేమిరా తనయా.

మా యన్నయగు రావణు డెంత కఠినాత్ముడమ్మా తల్లీ.

కైకేసి. యేలరా విభీషణా.

విభీ. రాముడు వార్ధిదాటి మన లంక ప్రవేశించె నిక యేమి యోచనని మంత్రులతో ప్రస్తాపనాడ యా దురాత్ములు మే మింత మందివుండి నీకు చింతయేల యీ రామకపులపై వెడలుచున్నామన అపుడు నేనడ్డమై ఆవిష్ణువగు రాములతో నీకేలవైరము లంక చెడును యిక సీత నొసగుమని నేచెప్పగా అన్యాయముగా సభయందు నాకవ మానంబుగ కాలికొద్ది తన్నగా గద్దెపైనుండి క్రిందికి పడి వస్తి నిక యీ పురంబున నే నుండనొల్లనమ్మా కైకేసి.




కైకేసి - దర్వు - హిందుస్తాని కాఫి.

హాకుమార నీకు ఘోర శోకమేలరా। ప్రాకాటముగ రాముల చెంతా పోయి బ్రతుకుముగా॥ హాకుమా॥వినసీవానిజోలికిపో వేలాబోతి విగా। మానవుడనక ఘనుడా బ్రహ్మ మొదలౌ దేవతలకైనా॥ హాకు॥

మాటలు. అయ్యో అటు విననివానిజోలికిసి వేలబోతివి మునుపు మీ తండ్రియగు పులస్త్య బ్రహ్మ దేవతలయెదుట సముద్రమును తరచు సమయమున నేను అచటికి జని మీ తండ్రిని వేడుకొనగా సెకు యిద్దరు దుష్టులు బుట్టుదురు వారలలో నీ చిన్నకొమారుడు దైవభక్తుడగును అని వచియించెనుగాన నిక యా శ్రీరాములచెంత జనుము నిన్నికరక్షిం చును తనయా విభీషణా.

విభీష. చిత్తమని వెడలును.

విభీషణుడు రాములకడకు జనుచుండ కపులుజూచి.

గీ. వచ్చుచున్నాడు రాక్షసు డెవడొ యొకడు।
చూడు కపులార మనరామచెంత కిటుల।
ననగ వారలు యోచన నపుడుచేసి।
యాంజనేయుని తోడను ననిరిటుల.

ఆహా యెవడో వక రాక్షసుడు వచ్చునట్లుగుబడుచున్నదిగదా ఆంజనేయా.

ఆంజ. కపులారా అతనిప్రస్తావన మీకేల నూరకుండుడు.

విభీషణుడు రాముల చెంతకు రాగా.

రాము. ఆంజనేయా యితడెవరు.

ఆంజ. యితను రావణుని తమ్ముడగు విభీషణుడు రామచంద్రా.

రాము. యిచట కేలవస్తివయా విభీషణా.



విభీ. శరణు రామచంద్రా మాయన్నయగు దశకంఠుడు బహు దుర్మార్గుడు అతనికి సామభేద దండోపాయముల నెంత నీతి చెప్పినను వినడాయె రాములతో వైరంబేల సీతను యిపుడే తప్పక గొనిపోయి వప్పగించి శరణు వేడుమనగా నాపైన ఆగ్రహంబుబూని పురంబున నుండనివ్వకనను కాలితో తన్ని వెడలగొట్టెను గాన నీవే నాకు తలి దండ్రివి రక్షించవలె రామచంద్రా సద్గుణసాంద్రా.

రాము. మంచిది అటులైన మీయన్నయగు రావణుని వధియించి నిన్ను లంకాధిపతిగా స్థిరకాలంబు యేలునటుల పట్టాభిషేకంబు గావించెద నిక నిచటనే నాచెంతనుండు విభీషణా.

విభీ. పదివేలు నమస్కారములు మహానుభావా.

రాము. సుఖీభవ అని దీవించగా రావణుని వుత్తరగోపురంతట్టు.

విభీష-సీ. రామచంద్రటుజూడు రావణమంత్రులు కుడియడమ తట్టు కూర్చున్నవారు। వాని తనయులు భటులు వరుసగాయున్నారు మధ్యయున్నది మండోదరియును। పదితలలుగలవాడు పరమద్రోహిన వచ్చు వుత్తరదిశగోపురమునవాడు। చెలగి దేవతస్త్రీల చెరబెట్టు వాడును కర్మకాయుడు మహాకఠినుడతడు. గీ. అట్టివానిని జంప యే అధిపులకును। అలవిగాడింక శంకింప అనుటయేల। దిశలలోపల దిగ్విజయంబుగొన్న। వాడు మీచేత నేచావవలయుగాక.

మాట. అట్టి గర్వాంధుడు మీచేత దప్ప యితరులచేత జచ్చు వాడుగాడు మహానుభావా.

గీ. అనగి రవిసుతు డాగోపురమును పైకి।
నెగిరి తన్నగ పదితలలు నేలకొన్ని।
వారధిలో కొన్ని వానిముందరను కొన్ని।
పడగ పడగొట్టి జనె రామచంద్రుకడకు.

సుగ్రీవు. రామచంద్రా యీ తక్షణంబున వాని గోపురముపైకి నెగిరి కిరీటంబులు క్రిందికిపడునటుల కాలికొద్దితన్ని వచ్చితి మహానుభావా.

రాము. సుగ్రీవా నీవు వంటిగపోవుట తగదు యేల పోతివి అటుపోయినయెడల ముందు మన కార్యమునకు హానికలుగును అని తెలియదా.

రాముల-ద్వి. యేమిసేయుదు సింక యెద్దియోచనయు - నేమి దోచదు మదికి నెవడుపోగలడు - రావణువద్దకి రాయభారంబు - యీ

వాయుతనయుఁడు యింతకుమున్ను - పోయివచ్చుచుయుండి పోకార్చె
లంక - న్యాయముగాదు నే నీతని బంప - అంబుధిదాటియు ఆవలగడచి -
జాంబవంతుఁడు మరల రాజాలఁడికను - మంగళవతియగు మండోదరికిని -
అంగదుతనయుఁడు అతఁడెపోవలయు - యెల్లవిచారంబు యెరిగినవాఁడు -
నెల్లకార్యంబులు నెరవేర్చగలఁడు - గాన యీసుముహూర్త ఘడియల
లోన - వీనిబంపెదనికను వేరొకరేల.

మాట. యీసుముహూర్తంబున యీరావణువద్దికి రాయభారంబు జనియిపుడైనా సీతనొసగు వాఁడో లేక యుద్ధంబునకు జనుదెంచువాఁడో జాగ్రతగాపోయి తెలుసుకరమ్ము అంగదా.

అంగ. చిత్తము- అనివెళ్లును. రావణుఆస్థానమున.

రావ, తే-గీ॥ కపికులోత్తమ యిచటికికొత్తగాను । వార్ధిదాటి
యు వచ్చినవార్తదెల్పు । తోకకాల్పించుకొనిపోయె తొలుతనొకటి ।
మళ్ళిరాలేదు క్షేమమా మర్కటుంబు॥

మాటలు. యింతకుముందొక కోతిమాచేత తోకకాల్పించుకొనిపోయినదేగాక బయిటకురాలేదు యాకోతిక్షేమమాయిపుడవార్ధిదాటి నీవురాగలకార్యంబేమి నిపేరేమోదెల్పుము నిన్నెవరుబంపిరిరా వనచరాధమా.



అంగదుఁడు-ద్వి. ఓరిరావణ నీపువానరంగపినుము । రారపోరను
చునురయముగబల్క । నీకుమీరినవాఁడనిర్భాగ్యనన్ను । ప్రాకటముగ

నిట్లుబలుకుటకేగున । వాలంబువకుజుట్టి వార్ధులముంచు । వాలికికొమరుడవోరి అంగదుడ । నీకుమాలను ప్రాప్తినటు లేకపోయు । చేకొనియీలంక చెలగి యేలుటకు । అతడాదివిష్ణువు అతడె శ్రీరాము । డతనిసతి యగుసీతయే ఆదిలక్ష్మి । యనినీకు తెలియక యాలదెస్తివిర । అనువుగా యిపుడైన ఆరాములకును। వప్పగించుము నిపుడే వైరంబుమాని । తప్పితి వేని సేతల్రద్రుంచు నతడు.

మాటలు. వరే వేచెప్పబడు నీనివచ్చినవాడవై యింకా కొంత కాలము బ్రతుకగోరియాసీత నిపుడే సెప్పకవప్పగించి శరణు వేడుమున టుగాదేని నిన్నికఖండన చేసి నడుమనుగానినంతవరకు విడువడురాదను జాధమా.

గీ. అనుచుయీరీతి అంగదుడసురునకును ।
దెల్పవినిచాల కోపించిదెంపుకోడ ।
పంట్లుపటపటగొరుకుచు భటులజూచి ।
వీనిజంపుము యనుచుచ్చుత్తరువుజేసి.

రాక్షసులతో. వీనిబట్టి తక్షణముచంపివేయుము వీనివలెనేముందొక కోతివచ్చి సీతతో కొంతతడవు ముచ్చటాడిమనచే తోకకాల్పించుకొని బోయెగాగవీడతనివలెనే యున్నవాడిక పోనివ్వకుముభటులారా.

అంగదు. హాహా రావణానీకు నీయబ్బకు వెరచువాడగాను ముందునలంకగాల్చి వచ్చినవాడొకడు నేనొకడనుయింకమావలే యంతోమందిగలరు మేమేశూరులముగాదు పినరాదనుజాధమా.

అనగా రావణుడు దిగులుపడి.

రావణు. వీనినిఖండన సేయుము భటులారా.

అంగ-సీ. నీకుభటులకు నెదిరేవాడనుగాదు నీవంటివాని నేజూచియుందు । నీవేరావణువటర నీవలెనెందరోగలరు నెనొకడవాఘనుడవిచట । మాతండ్రివాలమున మడగజుట్టియునొకని వార్ధిలోముంచేసి వంటివాని । ఘనుడుకార్తవీర్యకారా గృహంబున ద్వాదశాబ్దలుండే దనుజుడొకడు.

గీ. అట్టివాలికిపుట్టిన అంగదుడను । నీకుభయపడ నింద్రాదిసురలుగాదు । సీతనిక నైన నొసగుమునిగ్గుతోడ । యాలజన్మించితివి నీవుయసురనాథా.

మాటలు. యికనైనా నేచెప్పెడు మాటలకొప్పిగొప్ప బుద్ధిచేతప్పక యాసీతనొప్పగించుము నటుగాదంటివా యీరాములచే నీచావు నిక సిద్ధమనినమ్ముమురా రాక్షసాధమా.

రావ. వరేవనచరాధమా మృగఘర్జనకు శిహ్మాంబదరునా నీవు నాకు చెప్పెడివాడవా నిజంబుగనీనాలికొమరువై విూతంద్రికినాకు శతృవగుయీబక్కమానవు డగురాముల చెంత నీవొరుడ వెక్కమందిపైకి యెక్కువైనవాడవుగా వుందువాకపికులాధమా నికనోరెత్తిన ఫల మేమిసుమా.

అంగ. వరే నీఅనుభవముసీవు అనుభవించెదవు చూడుమురా రాక్షసాధమా.

రాముల చెంత- అంగదుడు-గీ. రామచంద్ర వినడు రావణుడను వాడు। యుద్ధమునకు వెడల యుచితమగును। గానతడవు శేయకారణ మేమింక। కపులతోడనికను కదలవలయు.

మాటలు. నికతడవు సేయుట యుచితంబుగాదుగాన జాగ్రతగా వెడలుదము పదండి రామచంద్రా.

రావణు. హాహా భటులారా యికమీరుజనియీరామ లక్ష్మణు లాంగదాదులపై దొమ్మియుద్ధము జేసిరయంబున వారలనొక్కపెట్టున జంపిరమ్ము రాక్షసులారా.

క. అనరాక్షసులకు ముందుగ।
ఘనకపులును వేలమందికదసిరియిప్పుడుక్ ।
ననువుగనా రాక్షసులను।
గనిజంపి యుద్ధమునను ఘుడి లోనప్పుడుక్.

మిగతహత శేషులు దశముఖునికి రావణా అన్యాయము గమనబలంబణగే మేముమిగిలివచ్చితిమిక యేమి శెలవో॥

గీ. అనగయింద్రజిత్తు అపుడిట్టులనియెను।
నేనుపోయి వత్తునిజముగాను।
యింతమంది యేల యేనొక్కడునుచాలు।
నన్ను బంపుదనుజ నవసరముగా.

యింద్రజిత్తు. గానశీఘ్రంబుగ నేపోయివచ్చేన రావణా

రావణు. మంచిదిపోయి రమ్ము.

క. యిటు రావణాజ్ఞగైకొని।
పటుతరముగ పయన మయ్యెబహుతీవ్రముగా।
తటుకున రాములకడకును।
పటపటదంతములు గొరికిపదపడి వెడలెన్.



యింద్ర. హేరామానాచేవిడువబడిన శరంబులకు పారిపోక నిలువుము.

రాము. యికనాయొక్క బాణంబువచ్చుచున్నదికతప్పకవిడుచు చున్నాను జూడరా. యింద్రజిత్తు.

గీ. కపులపైనరామ లక్ష్మణుపైనను।
మేఘమందు నిలచిమేటియైన।
శరములోన నొకటినిర్వాప్రస్త్రీమేయగా।
మూర్ఛదగిలేకపుల మూకలెల్ల.

మాటలు-యింద్రజిత్తు. హేరాక్షస భటులారా యీరామలక్ష్మణులను నాగపాశములతో గట్టివేసితినికమాతండ్రియగు రావణుని మనుబు సంతంసంబు జెందుచుగదా. అవును.

క. నారదుడంతట గనుగొని।
యారాములజేరవచ్చి యాటెమోదముతో।
వీరిటునుండగదగునా।
గారవమున దలపుమదినిగరుడుని విభుడున్.

నార. నీవు ఆదిమూర్తివై సాక్షాత్ పరంధాముడవు మీరీమాయచే నిట్లుండనేల మీవాహనంబగు గరుడునిదల్చుము రామచంద్రా.

నారదు. ఈ నారాయణమంత్రంబువలన ధ్యానించుము అనగా ధ్యానించును.

క. గరుడుం డిటులనురాగా ।
వురగములును వ్రాడిపోయి పరుగిడసాగెఁ ।
తరుచరులుమూర్ఛ దేరియు ।
ధారుణిపై లేచినిలచి దండము సేయఁగ.

కపులు. హారామచంద్రా పదివేలువందనములు మాకందరకును మూర్ఛదగిలె నిది యేమి చిత్రమో మహానుభావా.

రాము. యింద్రజిత్తుని సర్పాస్త్రంబుచే మూర్ఛదగిలినది అందులకు మీరుభయపడవలదు కపులారా.

గరుడు. రామచంద్రా పదివేలవందనములు మీమదిదలచిన వేళ నేనుండగా మీరేల చింతించెదరు మహానుభావా.

రాము. యీ యింద్రజిత్తుని సర్పాస్త్రంబుచే గట్టుబడి నిన్ను దలచితినిగాన నీతో కార్యంబుగలుగువరకు నీ స్థళంబుననుండుము పొమ్ము.

చిత్తము యని గరుడుం డంబుధిదాటి వెడలును.

కపులు–గీ. లంకలోపలపో యొకలావు కేక । వేశిరందరు ధ్వనులతో వేలకొలది । దశముఖుడుచూచి ధూమ్రాక్షు నపుడుబంప । వాయుసుతుచేత జచ్చెను వైరమునను.

తే–గీ. వానిచావువినియు వదలకచింతించి ।
వజ్రదంష్ట్రిడనెడు వానిదోలె ।
సంగరంబొనర్చి చాలగనలసియు ।
అవనిపైనిజచ్చె అంగదునితో.

సీ. కొంతచింతించి యపుడు యకంపనుణ్ణి ।
దోలె యుద్ధంబునకు రావణుండు నపుడు ।
కలసిపోరాడి వాడింక కదలలేక ।
ఆంజనేయునిచేజచ్చె యవనిపైనా.

మాటలు. అహా రావణా మనబలగంబెల్ల నశించి కూలిపోయె యిక యేమిచేయుదము.

సీ. ఇంద్రజిత్తుని కుంభిళియాగమపుడు ।
చేయబూనియు సామగ్రులన్ని జేర్చి ।
భటులబిలుపించి బల్లులుకప్పలన్ని ।
తెండిమీరని యాజ్ఞయు తెలియపరచె.

మాటలు. భటులారా నేను యాగము ప్రారంభించితిని బల్లులు కప్పలు తొండలు మొదలగువాటిని దండిగా పట్టుకరండిరావరీ.

తెచ్చియుంచినాము.

చేయుచుండగా కపులుగని.

మాట. వరె కపులారా నింద్రజిత్తు యాగముచేయుచున్నవాడు వానిని మనము చెరచివత్తము రండిరావరీ.

క. అనియిటుల కపులునందరు ।
గనియాగము చెరచిరపుడు కంపమునొందన్ ।
మనమున అనుమానముచే ।
ననువొందగ యింద్రజిత్తు నటుచాలించెన్.

నంతటలేచి సీతకడకుజని.




దరువు - ఇంగ్లీషు వర్ణన.

ఓ నారీమణిరో । నీ నాథునిమరది శిరములివి॥ వోనా॥ నామాట నమ్ముము । వాజిలో దునిమియు దెచ్చితిజూడుము॥ వోనా॥

మాటలు. హే సీతా నీ పతియగు శ్రీరాములవారి శిరంబును నీ మరదియగు సౌమిత్రిశిరంబును దెచ్చియున్నాను జూడుమిక యిక

నైనా నమ్ముము మాతండ్రియగు రావణునిచే హాతమైరిక యాల చింతించెదవు.

సీత. వరే మాయకారీ నీవెన్ని చతురోపాయంబులుబడినను నా నాథుడగు శ్రీరామ సౌమిత్రులకు అపజయంబు కలుగనేరదు పోరా దురాత్మా.

యింద్రజిత్తు. యికనిదుగో నీపైకి యుద్ధంబునకు వచ్చుచున్నా నిక నా శరజాలంబులకు తప్పించుకొనుము.

రాములు. యిదోవచ్చుచున్నాను జూడరా.

లక్ష్మ. వరే నేను శిద్ధంబుగ నిచటనేయుండ మా అన్నయగు రాములు నీతోయుద్ధంబుసేయవలెనా అధమా నికరమ్ము.

గీ. యింద్రజిత్తుమాయ యపనిజదెచ్చియు।
సభనుజూడ ఖడ్గమునసుచంప।
యపుడు రామచంద్రు యటుకొంత దుఃఖించి।
యనియెలక్ష్మణుండు యపుడువినగా.

రాము. సీతనన్యాయముగజంపె నిక గతియేమి.

విభీష. రామచెంద్రా ఆదిమూర్తివైన సీకీ మాయయెక్కడిది యింద్రజిత్తుండనువాడు చంపివేసినది నిజ సీతగాదని దెలియుము.

యింద్రజిత్తు. యిపుడు నీపైకిబాణంబు వేయుచున్నానుచూడుము లక్ష్మణా.

లక్ష్మణు. వీడుజూడ మేఘమండలములోపలజొచ్చి యుద్ధంబు సేయువాడుగదా వీని నిక నేనెట్లు చంపగలను.

ఆంజ. నాభుజంబులపై నిలుచుకొని వానిశిరంబు దెగ వేయుము నిందుకు యోచనేల.

లక్ష్మ. అట్లనైన నరియేకానిమ్ము అని భుజములపై లక్ష్మణుడు బాణమెక్కుపెట్టె.

ద్విపద. యారూఢిమెరయ దివ్యాస్త్రంబుచూడగి - ఆరామ విభుడు ధర్మాత్ముడౌనేని - దేవియూసీత పతివ్రతయేని - దేవతాకరుణనా దెసగల్గెనేని - యింద్రాదులకునెల్ల హితముగునేని - యింద్రజిత్తునిశిర మిమ్మహాశరము - వంచనలేకను వాయునుదలమున - ద్రుంచి వేయుతగాక దృష్టిమిస్సంది.

మాట. యిదో నాచే విడువబడు యీదివ్యాస్త్రమున యింద్ర జిత్తుని శిరము తెగిబడుగాక యని విడువగా ధరణికి తెగిశిరంబుపడును.

మాటలు. యింద్రజిత్తునిశిరము క్రిందికి తెగిపడగా రాక్షసులు చూచి సులోచనతో చెప్పుదురు.

రాక్ష-క. యేమిసులోచన నీవిభుడా । రామానుజుచేతజచ్చె రయమున నిపుడుగా । యామర్కటగుంపునుగని । మేమిక తప్పించు కొనియు వస్తిమి యిటకున్.

మాటలు. వోసులోచనా నీపతి యాలక్ష్మణునిచే పడిజచ్చె నిక నీవచటికి జాగ్రతగాపొమ్ము.

సులోచన. అయ్యో యిదియేమి అన్యాయము వారిజోలి పోవ నేల అత డిటుచావనేల యిదియొక వింతయైదోచె అయినను పోయివ చ్చెద అని దుఃఖించుచు చెలులతోగూడి తన విభునిగని పైబడి శోకంబుచే.

సులోచన. నేడ్చుచు.



దరువు - తోడిరాగము.

(రాములచెంత) పోతివే ప్రాణనాథ హా । యీలీరున సంగరమున సౌమిత్రితో॥ పోతి॥ నాదుగతియు యేమియింక । నన్ను యెవరు మన్న నతో పోషింతురు॥ పోతి॥ నీదువెంటా వచ్చెదికను నిరుపురమును । సహగమనము విడనాడియు॥ పోతి॥

అని యేడ్చుచు రావణుతట్టుచూచి.

క. మామా యెంతటివాడవు।
నామగనిఁ బంపుటకును న్యాయమెనీకుఁ।
రాములయెదటికి జని నీ।
కొమరుని శవమింక దెమ్ము కొనిపోయెద నే.

మాటలు. మామా వ్యర్థముగ నాపతియగు నీకుమారుని యా రామలక్ష్మణులపై యుద్ధంబునకుబంపి చంపించినవాడవైతివి అయినను యిపుడచటికిజని అతనిశవంబును దెచ్చియిచ్చిన నేగొనిపోయెద పోయి రమ్ము రావణా.

రావ॥ అమ్మా సులోచన నీపతియొకడేగాదు బలాఢ్యులగు నాకుమారులు వారిచేత చనిపోయినందుకు దిక్కు లేనివాడనై వ్యసనమునయున్నవాడ యిపుడు నాశత్రువగు యారాముల చెంతకుపోవుటకు నామనసొప్ప దిక కావలసినదానవైన ధైర్యశాలివైతె నీవె యా రాములకడకుజని నీమగనిశవంబు వేడుకొని తీసుకొనిపొమ్ము.

సులో. అయ్యో నీ కంతటిధైర్యము లేనియెడల యా రాములు నీకు గాక నాకు శత్రువా నిక నేనేపోయి వేడుకొనియెద అనుచు అచటికి జని.

సులో-క. దండము దశరథ తనయా। దండము కోదండరామ దయగుణధామా। దండముజేసెద నీకును। దండమయా పుండరీక దళనేత్రహరీ.



మాటలు. రామచెంద్రా మీకు పదివేలవందనములు.

సుఖీభవ. యవరమ్మా నీవు.

సులో. మీ తమ్ముడగు లక్ష్మణునిచే చనిపోయిన యీ యింద్రజిత్తు భార్యనగు సులోచనందురు నన్ను మహానుభావా.

రాములు. ఈ సభలో నీవేల వస్తివమ్మా సులోచనా.

సులో. ఈ చనిపోయినయింద్రజిత్తు మీ అంతఃకరుణతో ముక్తి జెందును గాన మీరు దయచేసినట్లులైన యీ శవంబును గొని పోయి యితనితో నేనును సహాగమనం బగుచున్నాను రామచెంద్రా.

రాము. అమ్మా నీధైర్యసాహాస పతీవ్రతామాహాత్మ్యంబునకు మెచ్చితి నిక నీ మొగనికి ప్రాణం బొసగెద గైకొనిపొమ్ము.

సులో. నిక నే నొల్లను యీ శవము నే గొని జనుచున్నాను సెలవొసగుము రామచెంద్రా.

రాము. అటులైన నీ యిష్ట మిక గైకొనిపోవమ్మా సులోచనా.

అనగా గైకొనిపోయి సహాగమనమవును.

సులో. చెలులారా నా పతిశవంబును దెచ్చితిని సిక మే మిరువురము సహాగమనంబగుచున్నాము.

చెలులు. సహాగమనము నీ వేల అగుదువు మానవమ్మా సులోచనా.

సులోచన. నే నొల్లను యీ కలిమి యీ సంపత్తు నిక నాకేల నా పతివెంటనే బోవుచున్నాను చెలులారా చిత్తము.

అనగా సహాగమనమగుదురు.

మాటలు-గీ. ఇంద్రజిత్తు చావువినకు రావణుండిటు। మదినికుంది చాల మూలబలగ। మందరిటుల బంప మానక యుద్ధము। చేసిరాము చేత చచ్చిరపుడు.

అయ్యో వీరలు హతమైరి యిక దిక్కెవ్వరనుచు కోపోద్దీపితుడై రాములమీదికి బోవ విభీషణుడు రణతురగంబు లిరుగగొట్టగా రావణురథు.



క. గంటలశక్తిని దీసియు
  వంటిగ లక్ష్మణునిపైన వదలక వేయుర్ !
  మంటలు మండుచు జన దశ
  కంఠుని కరమొదలిపోయి గ్రక్కున దాకెన్.

అంతట లక్ష్మణుడు మూర్ఛజెందును.
రాముడు సౌమిత్రిని తొడపైనుంచుకొని శోకము జెందును.

ద్విపద - మారువ.

నాతమ్ముజూచితే నలినాప్తకులజ - యీ తెఱంగునగుంది యిటు లున్నవాడు - సీతగోల్పడి సీతచెరమాన్పలేక - యీతీరు పీనిచే యిటు పడిపోయె - యితనిసమాన మింకెక్కడదెత్తు - యేతీరుతాళుదు యేమి సేయుదును - యత్నంబుజేసిన యవనిజబోలు - పత్నినొండొకచోట బడయంగవచ్చు - పురముకుబోవను బుద్ధెటుబుట్టు - నరుదార నాకిటు నజుడుచ్రావాసె- యెక్కడలక్ష్మణుం డెక్కడయనిన- అక్కటా యేమందు అపుడుతల్లులకు - కౌసల్యకైక సుమిత్రలాదిగను - భాసురంబుగనన్ను బాధించగలరు.

మాట. హే సుగ్రీవా నాతమ్ముడగు లక్ష్మణుం డిచట గోల్పడితి నిక యీతని విడచి పురంబునకు నెటు బోవుదు యత్నముచేసిన యీ సీతకు సమానమగు యింకొకసతిని తెచ్చినా తేవచ్చును గాని

యీ సౌమిత్రికి బోలువా నిక నెచట దేవచ్చును ఆహా దైవయత్నం బునకు నేమిసేయుదును.

సుషేణు. రామచెంద్రా యిందులకై నీ వేల చింతించెదవు నిక మన వాయుసుతుని అవుషధశైలకు బంపుచున్నాను.

రాములు. శీఘ్రముగ బంపుము సుషేణా.

రాములు. ఇంతవరకు నాకు సహాయముచేసిన వాడవైతివి నీ వొకడవు తప్ప మిగిలినవారితో యీ పని కాగలదుగాన జాగ్రతగా జని అవుషధ మూలిక నొనిరమ్ము ఆంజనేయా.

ఆంజ. చిత్తము రామచెంద్రా.

సుషేణు-ద్వి. శ్రీకరంబుగ రామశుభ మొసగుసీకు - సకల కార్యముల నీసాటియువరెంక - వాయునందన నీవు వాయువేగమున - పోయి రమ్మిక ప్రొద్దుపొడువకమున్నె - అరుణాద్రిదాటియు ఆవలగడిచి - వర ద్రోణగిరికిని వనరుగాజనియు - నరుదారదక్షిణ దిశలను వెదకి - పరికింప తెల్లని పత్రముల్ గనియు - యత్తగపూలున్న యదియె సంజీవి - కత్తి లతోనలుపుసంధానకరణి - విరివిగానుండు విశల్యకరణనగ - సరవితో తెలుపుగ సౌవర్ణకరణి - యివినాలుగును తెమ్ము యింకనునీవు - అవుషధంబులు నీవు అవసరంబుగను.



మాటలు. హే ఆంజనేయా రామకార్యార్థమై జాగ్రతగాపోయి ప్రొద్దుపొడువకముందు యీ యౌషధంబులు ద్రోణగిరియందు వెదకి తెచ్చినవాడవై లక్ష్మణునిప్రాణంబులు బ్రతికించుము ఆంజనేయా.

ఆంజ. ఈ సమాచారంబు నీకు బాగా తెలుసునా సుషేణా.

సుషే. ఋక్షేశుడు మున్నొకసారి తెచ్చియుండెను గాన అందుల విషయములు నేను చక్కచేసెద పొమ్ము ఆంజనేయా.

ఆంజ. అట్లైన నిపుడే వార్ధి దాటిపోయి వచ్చుచున్నానయా సుషేణా.

సుషే. జాగ్రతగా పోయిరమ్ము అనగా వెళ్ళును.

సుషే. క. సురపతి నీశిరమును నిం
డరుదుగ నీముఖము నలుడు నంఘ్రులుమరియున్ ।
హరి నీబాహుయుగంబులు
హరుడును నీతోక గాచుదురు హనుమంతా.

మాటలు. నీ శిరమునందు దేవేంద్రుడు నీ ముఖమునందు నలుడు నీ బాహువులందు విష్ణువు తోకయందు యీశ్వరుడు వీరలువుండి కాపాడుచుందురు పోయిరావప్పా హనుమప్పా.

రావణు. హోహో భటులారా కాలనేమిని బిలువుడు.

చిత్తము వచ్చియున్నవాడు రాజేంద్రా.

రావ. హే కాలనేమి నేను యీ రాముతమ్ముడగు సౌమిత్రిని గంటలశక్తిచే మూర్ఛబడగొట్టితిమి. యిక హనుమంతుడనెడువాడు యీ వేళ ద్రోణగిరికి సంజీవికై వెడలుచున్నవాడు గాన నీవు యీ క్షణము నడురేయిన అడ్డము పొమ్ము.

అనగా మంచిదని త్రోవనొకమునియై యుండును.

వ. హనుమంతుడచటికి జని యీ మునిని వుదకమడుగ నొకకొలనుజూపును నంతటకొలనులో నడుగిడమకరి మ్రింగును దానిహృదయము నుండిధాన్యమాలి వెడలును నీ వెవరుకడుచోద్యముగా వెడలితిఅప్పా నేను ధాన్యమాలిని నిక నాజన్మపావనమాయెను వీడు మునిగాడు రావణుడు బంపగావచ్చిన మాయాకపటవాని గనుక వీని నొక్కపెట్టున లెక్కపెట్టక చంపివేయుము అనగా యుద్ధము చేసిచంపును వానివక్షముపగిలి తటాలున చచ్చును చచ్చినక్షణంబున సుగ్రీవుడయ్యో ఆంజనేయుడు సింహంబాయె యీసుగ్రీవునిచంప శతశృంగుడాయెను ఆక్షణంబున గా

క్షసులు నడ్డమై రాగా వారలజంపి ద్రోణాద్రికరిగి ఔషధీలతలగిరి కరంబుల ధరించుకొనివచ్చుచుండ అయోధ్యాపురియందు భరతునివలె గనపడగా నచటికివచ్చి నిలువ రావణుండు కుహాకముచే పదివేలమందిని రాక్షసులబంపగా కొందరు ఆయుధంబులతో విసరుటనుచూచి తా కొంతమందిని పాదములతో కొందరిని వాలముతో జుట్టి జంపివేసి వచ్చుచుండగా జాంబవంతుడు గని వెలుగుజూచి వోహో ప్రొద్దెక్కుచున్నది యింకా ఆంజనేయులు రాలేదని చింతించుచుండ ఆ పెద్దవెలుగును గని ఆంజనేయుడే వచ్చుచున్నవాఁడని సంతోషంబున నెదురుగరాగా అపుడు పర్వతముదెచ్చి సుషేణునిముందర నిల్పగా నాతడు సంజీవికరణి సంధానకరణి సావర్ణకరణి విశల్యకరణి అనునాలుగు ఔషధములచేత లక్ష్మణుని బ్రతికించిరి.



మాటలు. ఆహా సుగ్రీవా లక్ష్మణుడు బ్రతికినవాడాయె నికనా మనంబు సంతసిల్లుచున్నది.

రాము-సీ. రావయ్య లక్ష్మణురమ్ము నాతొడపైని కూర్చొను మింకను కుదురుగాను। నీముద్దుమొగము నేనెన్నడు జూతునో యనినాదు మదిలోన యనుచునుంటి। శత్రుడీదశకంఠుశక్తిబాణముచేత। నీపైన వేయగానీకమూర్ఛ। దగిలియుండగ నాదు తనువునప్రాణముల్ నిలుపశక్యముగాక నిన్నుబట్టి॥ గీ॥ శోకమొందితి నాపుణ్యఫలవిశేష। ము

నను బ్రతికితివయ్యా నాముద్దులయ్యా । నిన్నువిడచియు నేఁబ్రతుకజాలన
య్యా । లక్ష్మణా లెమ్ము యిక నీవులక్షణముగ.

మాటలు. హాలక్ష్మణా నీవు మరలబ్రతికినదే సర్వభాగ్యములు
తమ్ముడా.

లక్ష్మ. దైవయత్నంబునకు మనమేమిచేయుద మన్నా రామా.

రావణుడు. ఓరీభటులారా మనరథంబు యారాములరథంబు
ను డాకునటుల పోనివ్వరా.

చిత్తము రావణా అని వడిగా దోలుదురు.

రావణు. హే రామా యిదుగో నిన్నొక పెట్టుకు నిచటనె చంపు
చున్నాను చూడుము.

రాము. రారావోరీ రాక్షసాధమా. యనుచు.

పంచచామరం - రాముడు - రావణయుద్ధము.

రా. శరంబుతో దురంబునన్ శిరంబు లింక ద్రుంచెదన్ ।
పురంబు జూచిపారితే రథంబు విరుగగొట్టెదన్॥

రావ. పారిపోరచోర నాపరాక్రమంబు గానవా
వోరి నీ విచారసారశూరత నాకెరుకరా.

మాట. వోరే నీశూరతింక నాకు దెలుసును నిలునిలురా రామ.

రాము-క. అనియిటుల పోరువేళను
ఘనబాణము రాము డిడువ కడువడిరథమున్ ।
తునియలుగా పడె ధరణికి ।
ననువొందగ పారిపోయె నతిఖిన్నుడునై॥

పారిపోయి నేలకు తలలొంచుకొని యుండ.

మాటలు. ఓరీ పారిపోతివే రాక్షసాధమా యిప్పటికి బ్రతుకు
పొమ్ము. యని నవ్వుకొనుచు.

రావణు. ఓరీ భటులారా మీరు జాగ్రతగా పోయి యాకుంభక
ర్ణుని నిద్రలేపక రండురా వరీ.

చిత్తము అని వెళ్ళి.

రాక్ష. ఓరీ అచటయుద్ధంబునకు రమ్మనికొట్టుకుంటుయుండగా
యింకానిద్రపోయెదవా లెయివేరా దున్నపోతా వరే వీడుయిట్ల లేచు
వాడుగాదు గడ్డపారవిరుసుకైనా మొత్తగకాచి తెత్తాముదావరే. అవు
నౌను పదా.

ఒరే చేతులుగాలకుండు నటులపట్టుకవచ్చి చెవులయందు పెట్టురా. అట్లనె పెట్టుచున్నము చూడు.

ఒరే యీగడ్డపారవిరుసులు పోగవెళ్లుచుకాలుచున్నవి యిందులకైనా వీడుమెలకువతో లేచినాడా కదలకనె యిక్కడికక్కడికి పొర్లుచున్నాడురా యెంతమనుబోతురా ఒరే యేనుగలైనా నాలుగైదుపట్టుకవచ్చి త్రొక్కించిచూతము తాళురా యిగో యేనుగలు వచ్చుచున్నవి తెండిపైకియెక్కించురా ఒరే వీనిముక్కులు చెవులలో బాగానాట్యమాడుచు యెక్కి త్రొక్కుదుముచూడుకుంభ. ఒరే నిద్ర లేపినదెవరురా.

అచట యుద్ధంబునకు పిలుచుచున్నారు లేచి మీయన్నయగు రావణుచెంతకు జాగ్రతగా రావయ్యా కుంభకర్ణా.

ఆవలించుచు లేచి వచ్చుచున్నాను పదరా అనివచ్చి.

హే రావణా నన్ను పిలువ కారణమేమి.



రావ- గీ. ఏమిచెప్పుదు తమ్ముడ కుంభకర్ణ।
భూమిజను నేను దెచ్చితి బుద్ధిపుట్టి।
రామలక్ష్మణులును వచ్చి రణములోన।
చంపివేయగ మనవారు చచ్చిరిపుడు॥

మాటలు. సీతనుదెచ్చిన నెపంబున యా రామలక్ష్మణులు మనజనంబులందరిని హతముచేయుటకు వార్ధిదాటివచ్చి యుద్ధంబునకు సిద్ధంబుగవచ్చి యున్నవారికి నీవొక్కరుడదప్ప మిగతవారు పోయిరి గ

నుకనీవు జాగ్రతగా వారిమీదికిపోయి వారలసంహరించి రావయ్యా కుంభకర్ణా.

కుంభ-గీ. అన్న రావణ నిన్నను ఏమిఫలము।
తెలివిలేకను సీతను దెచ్చితౌర।
మూర్ఖమేలర నీకిట్లు మూఢదనుజ।
చేటుదెస్తివి లంకకు చేటుమారి॥

మాటలు. రావణా నీదుర్బుద్ధివల్ల సీతనేలదెస్తివి పెద్దవాడవై పెద్దబుద్ధిమాని పెద్దరికంబుగలంక జెఱుచుటకు సిద్ధమైనవాడవైతి వికనీకెవ్వడు బుద్ధిగలుగునురా బుద్ధిహీనుడా.

గీ. అనుచు లేచిపోయి ఆకుంభకర్ణుండు।
భూషణములతోడ పొంకముగాను।
అన్నకడకు జనియు అతికోపమును దెల్పి।
వెడలె యుద్ధమునకు తడవులేక॥

కుంభ. హే రామా నీవైయిక సిద్ధంబుగ యుద్ధంబునకు వచ్చియున్నవాడ నాతోపోరాడి బ్రతికిపోదువు రారా వరే.

రామ. హే అధముడగు కుంభకర్ణా నిన్నిక యిపుడే భూక్కపెట్టి నీతలద్రుంచివేసెద జూతువు రారా వరే.

కుంభ. యిదుగో నాపరాక్రమంబు చూడుము



రాము. నాబాణంబుచే యిపుడేహతమై పోవుచున్నావు చూ డరా వరే.

యని పోరాడుదురు.

గీ. అనుచు బాణమేయ ఆకుంభకర్ణుండు ।
తలను తెగియు పడెను ధరణిపైన ।
దైత్యు లంద రపుడు తప్పించుకొనిపోయి ।
రావణునకు దెలియ జెప్పి రపుడు॥

రాక్షసు. హే రావణా మన కుంభకర్ణుడు రామబాణంబుచే కూలిపోయెను మహానుభావా.

రావణు. అయ్యో యిక నేమిచేయుదు బలగమంత నేటికి మునిగెను భటులారా.

అతికా. హే రావణా నేను యీ రామలక్ష్మణులమీదికిపోయి వారల చంపివచ్చెద నీ విక చింతించకుము.

రావణుడు. అయ్యో నీ వొక్కడవు తప్ప మిగిలిన వారందరు హతమైరి యిక నిన్నెటుల బంపుదురా తనయా.

అతికాయుడు. నేనుపోయి వారలతో పోరాడెద నీవు చింతించవల దిక వెడలివచ్చెద రావణా.

అతికాయుని - దర్వు - దర్బారురాగం.

ననుబంపు పోయివచ్చెదా । ననిలోన గెలిచెద॥ నను॥ వినుము నామనవియును ఘనముగ మనమునను అనుమానమేలను॥ నను॥ వైరియగు శ్రీరాము లనుజుని శిరములను బడద్రుంతు ధరణికి॥ నను॥

మాటలు. హేరావణా యిక ఆలస్యమేల తక్షణంబున నేపోయి వచ్చెద.

రావణు. పోయిరమ్ము తనయా.

అనగా వెడలి.

అతికాయుడు. ద్వి. రామనీవెంతటిరాజవునీవు - నీమగతనమెల్ల నిక దెలుసుమదికి - మాతండ్రికతమున మహిరాజువైతి - మాతండ్రికతమున మాన్యుడవైతి - యెక్కడగురుడని యెలుగనిసికు - దిక్కయ్యె నేనింక దినకరాత్మజుడు - నరుచార నింద్రజిత్తుడు గట్టెసట్టి - వురగపాశంబులు వూడ్చుకొన్నట్టి- వాడవు నీవె గాబోలు వోరామ- నేడు నాతో

రణము సేయుట నీకు - సామర్థ్య మున్నదా సౌమిత్రికైన - యేమడుగు దాగినా వెతకియు నిన్ను - పలుకు లేటికి నింక బట్టెద గాక - చెలువుగ వారిధి జొచ్చినాగాని - తలపు నీమీాదను తప్పదు నాకు - నిలచిపోరా డుదు నిన్నేలవిడుతు.

మాటలు. రామా నీ వెక్కడ దాగినను నీ ధ్యానమే నాకు గలదు నిన్నేల విడచెద నిక నాతో పోరాడుదువు రమ్ము.

అనగా లక్ష్మణుడు కోపంబుచే.

లక్ష్మ. వరే నిన్నుజంపుటకు నేనుయుండగా మా యన్నయగు శ్రీరాములు గావలెనా అధమాధమా.

అతి. వరే లక్ష్మణా నీవు బాలుడవు నా బాణముదెబ్బకు తాళు టకు మిా యన్న రాములు వినవా నీచేతగాదురా మూర్ఖా.

అనగా రాములు చెవిలో మెల్లన సౌమిత్రికి జెప్పెను.

లక్ష్మణు. రారా వరే అతికాయుడా.

అతికాయు. అటులైనా యిపుడే వచ్చితిరా లక్ష్మణా.

గీ. అనుచు యీరీతి నతికాయు శరము దీసి ।
లక్ష్మణునివేయ నది ఫాలమునను దాక ।
గినిసి బాలయు సౌమిత్రి గొప్పదైన ।
పరగ బ్రహ్మాస్త్ర మేయుగా పడియు చచ్చె.

రాక్షసులు. అతికాయుని చావు చూచి పారిపోయి రావణునకు దెల్పగా నేలకు తలలువంచి కన్నీరుతో దుఃఖించుచుండెను.

ద్వితీయాంకము - ముగిసెను.



# తృతీయాంకము.

కైకేసి- ద్విపద. యాలరావణమూర్ఖమికమానవైతి- నిలమీాద మనవంశమంతయు నణగె - చెల్లెలు నగు శూర్పణఖ వల్లచేటు- యెల్ల వారికి గలిగె యేమందు నికను - చేకొని మోహింప చెలరేగి పోయి- పోకార్చుకొనె ముక్కు- చెవులును నపుడు - కొడుకుచేనైనను కూతుచే నైన - వడికీర్తి నపకీర్తి వచ్చు పెద్దలకు- యేమికాలమొ గాని యెఱుక చెప్పడదు- కామాంధునకు ధర్మగతియేల గలుగు- అతడె విష్ణువుడాది వైకుంఠుడతని- సతియగు సీతయే సమరయాలక్ష్మి- దైత్యులమర్దించు టకు తలపోసి - అత్యంత ప్రేమచే అవనిపై నపుడు - పుత్రకామేష్ఠియు పోసగంగజేయు- క్షత్రియుదశరథాక్షితిపతిగర్భ - మునరాముడై పుట్టె ముఖ్యంబుగాను - యనుచు దెలియక నీవు యాలదెస్త్రీవిర - లోకంబు లకునెల్ల లోలాక్షి సీత - నీకుమాతయుగాదె నిర్భాగ్యదనుజ - చేకొని యికనైన చేయుము సంధి - ప్రాకటంబుగ శరణు వేడుము పొమ్ము.





మాటలు. ఇకనైనా నామాటలకు తప్పినవాడవై తప్పక యా సీతను రాములకొప్పగించి బ్రతుకగోరుము తనయా రావణా.

రావణు. హే జననీ యీ రాముడు ఆదివిష్ణువనిన్ని సీత లక్ష్మి యనిన్ని నాకు తెలియదా నే మూర్ఖుడనా కామించి తెచ్చినవాడనా యట్లుగాదు యిక యెన్నిదినంబులు యీ కాయంబు భరింతును యిక యీ జన్మమే చాలును గాన యీ రాములచేత యుద్ధంబున చచ్చిన ముక్తిగలదు గాన నీవు సకలశాస్త్రములు తెలిసినదానవై యీ రీతిగ నాకు చెప్పుట తగునా యిక నెన్నటికైనా సీత నిచ్చెదనా నీ నీతి చాలు నిక నగరికి లేచిపొమ్ము కైకేసి.

కైకేసి. అటులైన యిక నీ యిష్టంబు పొమ్ము నే నగరికి పోవు చున్నానురా తనయా.

రావణు. పోయిరావమ్మా జననీ అనుచు.

రావణు. ఓరీ భటులారా నే నిక పాతాళహోమము చేయు చున్నాను అందులకు కావలసిన రక్తాక్షతలు రక్తగంధము కావలసిన సమిదలుపుష్పదళములు సిద్ధంబుచేయుమురా వోరి.

రాక్షసు. చిత్తము తెచ్చియున్నాము రావణా అనగా.

రావణుడు పాతాళహోమమునకు కూర్చొని హే భటులారా శుక్రాచార్యుల బిలువుడు.

రాక్ష. వచ్చియున్నవాడు రావణా.

రాక్ష. నమోనమః శుక్రాచార్య.

శుక్రా. నన్ను పిలిపించిన కారణ మేమి.

రావ. నేను పాతాళహోమము చేయుచున్నాను గనుక నది విఘ్నముగానియటుల నెఱవేర్పుము.

శుక్రా-క. రావణ వినుమిక హోమము ।
గావింపుము విఘ్న మేమి కాకుండగద ।
త్పావకముఖమున వెడలును ।
హావాజిరథేషుధనువు హయములతోడన్.

మాటలు. రావణా యిక విఘ్నము కానేరదు గాన శీఘ్రంబుగ కానిమ్ము.

అనగా రక్తాక్షతలు రక్తకుసుమమాలికలును రక్తాంబరములు రక్తచందనము యివియన్నియు అచట హోమగుండము చెంత నుంచిన వాడై మంత్రములచే నాచరించును.





ఎట్లనగా,

క. మీలను తగరుల గ్రద్దల ।
నోలి వరాహాదిజంతువుల నొండొంటిఁ ।
ద్రేలిమివైచుచు నియమో ।
త్తాలధ్యానమునను౦డె తడయకనపుడుఁ.

మాట. రావణుడు హోమముచేసి ఆహుతిజంతువులు, చేపలు, పొట్టేళ్ళు, గ్రద్దలు, పందులు, వీటినొకటొకటి నొక్కొకసారి హోమగుండములో వేయుచు నొక్కొకమంత్రముచే నెఱ్ఱని యక్షతలు యెఱ్ఱని గంధము యెఱ్ఱనిపూలు యెఱ్ఱనిచందనము రక్తమాలికలతో హోమము చేయుచు పిమ్మట నొక్కొకశిరమును దెనేగసి ఆహుతిగుండమున వైచును.

మాటలు. ఈ హోమము చేయు సమాచారము కపులకు దెలిసి.

క. పదికోట్లగ చరవీరులు ।
విదితపరాక్రమములు గగనవీధి కెగసి స ।
మ్మదమొప్ప లంకజొరబడి ।
రదయత రావణుని నగరి కరిగిరియపుడున్.

మాటలు. ఓరీ కపులారా యీ దుర్మార్గుడగు రావణుడెచట యుండి దాగినవాడో యీ పురంబున తలుపులు ద్వారబంధములు గోపురములు పగడసాలలు కొట్టుళ్ళు వంటయిండ్లు బాగ వెతుకుదము పదండిరా వోరీ అని.

కపులు. గజ రథతురగశాలలు వెదకుచు రథంబులు నుగ్గుజేసి అచట నెదురుగయుండి ఆయుధాస్త్రశస్త్రంబులు విఱచి పాడుజేతురు. నింకా పోనివ్వక.

క. సరగున నంగదు డంతః ।
పురమునకే తెంచి యసుర పొలతిని మందో ।
దరి సిడ్చి తెచ్చె నచటికి ।
చెరనుండిన దివిజసతులు వెఱువగనపుడున్.

మాటలు. హే మందోదరీ నీ పతియగు రావణుడెచట యున్నవాడో చూపించెదవా లేక నిన్ను ఖండలుగ దెగనఱుకుదునా నన్నేల బాధించెదవు అయ్యో యని.





మండోదరి - దర్వు - జల్ ఝారాగం.

ఏడని వెదూకుదూరా॥ యంగాదానికనే॥ నేడని॥ చూడుము యీపురము సుదాతులయింట్లయందు చూడుమునీవు యీ స్త్రశాలమునం దెల్లను॥ యేడని॥ ఒంటిగ నేనుండ నంటి నన్నిడ్చేవు। కంటకయీమింట మంటనెయుంచునో॥ యేడి॥

మాటలు. అయ్యో నేనగిరియం దొంటిగనుండ అన్యాయం బుగ నన్నేల నంటి నీడ్చెద వీ మింటనో మంటనోయచట యున్నవాడో నివే చూడవప్పా అంగదా అనగా.

అంగదుడు కపులనుజూచి వో కపులారా యీ శైలగృహ మందు ఆహుతులచే పొగవెళ్లుచున్నది యిచటనే వాడుండవచ్చును నిక మీరందరు రాండిరావోరీ.

కపులు. యిదిగో వచ్చితిమయ్యా అంగదా.

వ. అచట జొరబడి అగ్నిగుండము చల్లార్చి ఆహుతులు పార వైచుచు సమిదెలు విఱుచుచుండజూచి మందోదరి హే నాథా మన యింద్రజిత్తుడను కొడుకు దప్ప యింకొకడువచ్చి నన్ను శ్రమబెట్టు చుండ సిగ్గులేక నీవు చూచుచున్నావుగదా యిది నీకు తగునా ఛీ.

క. కృతహోమమేటికీయా।
హుతులేటికి రామబాణ యుతశిఖిపూర్ణా।
హుతివై బడుమిక నీదు।
ర్మతములు మానంగలేవు మఱిబ్రతుకేలా.

మందోదరి. ఇక నీ శిరంబు రామబాణంబున కాహుతి నొసగుము నీ దుర్మతములు నీవేల మానెదవు నాథా.

అనగా ఛీ నిర్భాగ్యురాలా నా యెదుటి కేలవస్తివని లేచి, వచ్చి కోపంబుచే కనులెఱ్ఱగ జేసి,

రావణుడు-క. ఉరుబలుడు సర్పరోముని।
వరవృశ్చిక రోముడగ్ని వర్ణునిరణభీ।
కరుడైన ఖడ్గరోముని।
నరయక్ బ్రహళయాగ్యుపగిది నటుబంపించెన్.



మాటలు. ఒరే మీరలు పోయి యా రామలక్ష్మణులతో యుద్ధంబుచేసి సంహరించిరండురా వృశ్చికరోమా.

అనగా రణభేరీలతో ఘర్జనచే

నోరీ కపులారా మీ మగతనము చూతెము రమ్మి.

కపులు. వచ్చియున్నాము రారావోరీ.

వృశ్చికరోము. ఒరే మాదెబ్బ మీకు యెఱుకలేక వచ్చితిరి. యిదుగో మిమ్ముల మా పిడికిళ్ళచే నేలపాలు జేయుచున్నాముచూడరా.

కపులు. ఒరే యీగిరితరువులచే మీ శిరంబులు ద్రుంచెదము రారావోరీ అనుచు.

క. పనసాంగద నీలాదులు ।
వనచరవరు లెగసియమర వైరులమీద౯ ।
ఘనశైలకోట్లవైచిరి ।
తని యని కోపమున నపుడు ధరణింబడగ౯.

కపులు. ఒరే వీరు ధరణిపైబడి చచ్చిరి యిక వీరితో నేమి యిచటికి రమ్మి.

వచ్చుచున్నాము.

రామరావణయుద్ధము.

భటులు. హేరావణా మన వృశ్చికరోమ సర్పరోమ ఖడ్గరోమా చనిపోయిరి మహానుభావా.




రావ. ఇక నేనే వెడలుచున్నానురా భటులారా.

రావ. హే రామా యిదిగో నే విడువబడు బాణంబు నికతప్పించుకొందువు రమ్ము.

రాము. ఓరే సిద్ధంబుగ వచ్చియున్నాను పారిపోక నిలువుము రాక్షసాధమా.

పంచచామరం. పరాక్రమవిక్రమంబునన్ దొక్కరుడవు చిక్కితే।
వారిదురంబునందు నీశిరంబుద్రుంతుజూడరా.

రాము-పంచ. భట్టువలెను నీవు పట్టిమాటలిట్టుపొగడెదా ।
పట్టిద్రుంచు నిన్ను బాణ పారిపోకుదానవా.

రాము. ఒరే యిదుగో నీపైని ములురాలుచువచ్చెడి శరంబునకు నీ శిరంబు నిక దెగుచున్నది జూడరా రావణా.

అనివిడువగా పాఱిపోవును.

రాము. ఒరీ తప్పించుకొని పాఱిపోయెద విక నీపురంబునకు పోయి కొంచెమాయాసంబు దీర్చుకొని జాగ్రతగారారా రావణా.

మాతలి. మహానుభావా మణిమయకేతన రత్నరాజితంబుచే దీప్తియగు పుష్పకవిమానంబు నీకొప్పగించిరమ్మని పురుహూతుండు బంపియున్నాడు గైకొనుము రామచంద్రా.

రాము. చాలాసంతసించి తినయామాతలీ

మాతలి. ఈ రథంబు పైనుండి దశాస్యుని వధించుము రామచంద్రా.

రావణుడు పునహా వచ్చును.

మాతలి. హే రావణా నిన్నిక బొక్క బెట్టెదరా వోరారే.

రావణు. ఇదె వచ్చుచున్నాను నాశరంబువిడిచెద చూడరా.

రావణుడు-క. పదిచేతనుమాతలినిమరి।
పదిచేతను హరులనేసిపటుకేతనముగ్।
విదళించె నొక్కశరమున।
కదనంబునరావణుండు కడుతీవ్రముగాన్॥

రావణు. ఒరేనీరథతురగంబులును తెగనఱికితిపోరాతపీ.

రాములు కొంతచింతచేనుండగా.

అగస్త్యుడు. మహానుభావా నీవుఆదిమూర్తివై నిటు చింతించెద వేలఈఆదిత్య హృదయమనుమంత్రము పఠించి దశాస్యుని వధింపుము. అని బోధించును.

రావణుడు. ఒరే రామా యికనిన్ను విడుచుట ధర్మముగాదు రారావోరే.

రాము-క. అయుధ సామగ్రియు నధి।
కాయువు వర శక్తివడసియని ముజ్జగముల్।
మాయలగెల్చిన రావణ।
పాయకనినుగూల్తునికను పాటకురోరీ॥

రాము. ఒరే రావణ మాయలగెల్చిన వాణిలినిన్నికమర్దన చేయుచున్నాను రారావరే

రావణు-క. నిను నీతమ్ముని నేడా।
జినిజంపకలంక కేలజిని యెదనిటులన్।
ఘనదివ్యాస్త్రము చేకడు।
పనలమునకు నిలుశ్రీరామనిక వచ్చువదిన్.

మాటలు. హేరామా యిదుగోయీదివ్యాస్త్రంబు చేమిమ్ముల బరిమార్చెద జూడుము.

అనివేయగా లక్ష్మణుడు కొంచముమూర్ఛ జెందును.

రాములు. అయ్యో వీనిబాణంబుచే మరల నాతమ్ముడగు సౌమిత్రి మూర్ఛజెందెను గదా సుగ్రీవా.

సుగ్రీ. రామచంద్రా యితనినిదగిన శైత్యోపచారంబులచే బ్రతికించుచున్నాము యికయిందులకై నీవు చింతించకుము.

అని శైత్యోపచారంబులచేత లక్ష్మణుడు బ్రతుకునని సుషేణుడు మొదలగువారలు మున్ను తెచ్చిన సంజీవిచే శైత్యోపచారముల బ్రతుకును.

రాములు. ఆహా మరల నీ ప్రాణంబులు వచ్చుటనా భాగ్యము నిక చక్కగా నాతోడ పైనకొంచము కూర్చొనుము తమ్ముడా సౌమిత్రీ

రాముడు-సీ. అయ్యసౌమిత్రి నీవపుడు బోయినమూర్ఛ। బ్రహ్మకైనను వలె భాసురముగ। నాతండ్రి లక్ష్మణా నా భాగ్యముననీవె నిన్ను విడనాడి యెట్లుండనగును। నాముద్దులయ్యనగు మొగకాంతియు వోలగియున్నది జూడ దోలుతకన్న। జనకాజ్ఞమీరక జనుదెంచి నిచటికి నిన్ను గోల్పడుచుంటి నిజముగాను. గీ. తిరిగితలయెత్తి జూడగదయ్య నీవు। నీకు పగయేమి జేసితి ననుజనికను। పలుకవేలను పిలచిన పంతమేల। కనుల జూడుము నికనిను కౌగిలింతు.

మాటలు. ఇకనైనా యీ వంకదిరిగి పలుకరాదా తమ్ముడా సౌమిత్రీ.

నలనీలాంగద సుగ్రీవ జాంబవంత సుషేణాది మొదలైన కపులు రామచంద్రా యికె ప్రాణంబులు వచ్చియున్న వేమి పర్వాలేదు మహానుభావా.

లక్ష్మ. హాయని లేచి అన్నా నీవేలచింతించెదవు దైవయత్నంబు నను యేమిచేయుదమన్న రామ.

రామ రావణుల యుద్ధము.

రథారూఢుడై మరల హే రామా మగధీరుడవై నీపరాక్రమవిక్రమంబు చూపుదువికరమ్ము.

రాముడు. ఒరేరాక్షసాధమా యిదివరకు ౨-వ సారులు పారిపోయినవాడవై ఆయాసంబు దీర్చుకొనిమరలశౌర్యము గలిగివచ్చితివే యికనిన్ను విడక యిక్కడనే బొక్కపెట్టెదరారా రాక్షసాధమా.

రావ. ఒరేయిదో యీవచ్చుచున్న బాణంబులు దప్పించుకొమ్ము.

రాము. ఇదో వచ్చుచున్నాను రారావరే.

రావ-క. కరములిరువదియు వలెనే।
స్థిరమైయూరుధము కేలదెంపునవాడున్ ।
శరముల సురియలశక్తుల ।
పరశుగదాఖడ్గశూల పరిఘము వేసెన్.

మాటలు. ఓరీ నాశరంబు లురుకుచు నీపైనవచ్చి దాకినది చూడరా రామా. అనగా,

రాము-క. ఈ తడ వేమిటికి పుడీ।
ఘాతకు బ్రహ్మాస్త్ర మేసి కడువడి శిరముల్ ।
చేతులు మొలువక మున్నే ।
యీతని దెగటార్తు నింక యినసుత నిపుడున్.

మాటలు. హే సుగ్రీవా యిక తడవేల వీనిశిరంబులు చేతులు మొలవ కుండునటులఁ యిపుడే బ్రహ్మాస్త్రంబు ప్రయోగించుచున్నాను చూడు.

రాము. ఓరీ నాయొక్క బ్రహ్మాస్త్రంబు వచ్చుచున్నది జూడరా దురాత్మా యని విడుచును.

క్రిందబడి తిరుగా మొలచును.

రావణు. ఓరీయిదిగోనాబాణంబువచ్చుచున్నది జూడరారామా.

రాము. ఇదిగో నీపై మరల యిపుడే విడచితి నిక వచ్చుచున్నది చూడరా అని విడువగా.

అపుడే శిరంబులు మొలచును.

రాము. విభీషణా వీనిపై యెంత ప్రయోగంబు చేసినను శిరంబులు దెగి మరల మొలచుచున్న విక యేమి యోచన.

విభీష. రామచంద్రా మాతల్లి యగు కైకేశిని అడిగి వచ్చెద యని జనును.





విభీషణు. హే జననీ మా అన్నయగు రావణుడు యీ రాము లచే జచ్చె నమ్మా కైకేసి.

కైకేసి. కుమారా మీయన్న యగు రావణుని నాభియందు అమృతకలశం బుండునటకు చావులేదే యెట్లచచ్చెరా విభీషణా.

విభీషణు. అటులైన ప్రాణము లున్నవో లేదో కనుగొనెద నమ్మా కైకేసి.

కైకేసి. పోయిరారా తనయా.

అనగా రాముల చెంతకు వచ్చి.

విభీష. రామచంద్రా వీనికై యింకతడవేల నాభియందు ప్రయోగింపుము అనగా చెవిలో విని.

రాము. రారా వోరీ రాక్షసాధమా.

రావణు. ఇదో వచ్చియున్నాను రారా నరాధమా.

విభీషణు. రామచంద్రా బొడ్డున యెక్కుబెట్టుమని మరల చెవిలో చెప్పగా.

రావణుడు. ఓరీ నిన్ను తమ్ముడని నమ్మదగునా నాశత్రువగు యీ రామునికి రహస్యముగ బలికెదవా భ్రష్టా అన్నయను అభిమానము లేకపోయెగదా దురాత్మా.

విభీష. సరిదప్పిన వానిపై దయ దలచగూడదు కాలము తప్పినపుడు అన్నకు తమ్ముడు తమ్మునికి అన్న శత్రువులుగాడా నీవు సరివగు అన్నవైన సభలో నన్ను కాలితొద్ది తన్నుదువా మరియాద గానవా.

రావణు. రామా నీవంటి వాని సేననేకుల చూచియుందును. నీవు నాతో పోరి సీతను దోడుకపోయెదవా కాని రమ్ము.

రాము. ఓరీ వృథా పొగడుచేల నిక నీ మదమణగించెద రమ్ము. అని, అపుడు భూదేవదేవ తపసుల విశ్వామిత్రుడొసగిన శరముల మంత్రవేదముల దలచుకొని, శరము విడువ.

రాము-క. బలభేది శమన వరుణా,
దుల చేతను బ్రయ్యనట్టి తోరపుమర్మం ।

బలఘు విధి వచ్చి ప్రాణం ।
బులుగొనె నాదివ్యబాణ భువి నడరంగన్.

శిరములుపడ తక్షణంబున యా శరంబు మరలవచ్చి పొదిజేరును.





క. అలబాణక్షత రక్తము ।
లొలుకగ దశకంఠు డొరిగె నురువడి నపుడా ।
కులిశాహతిచే నిలబడి ।
కులశైలము రీతిబడెను కుంభినిపైనన్.

రాములు. విభీషణా వీని శిరంబులు ఇక తెగిపోవు నిక జరుగ వలసిన క్రతువులు జాగ్రతగా జరిగించుము అనగా విభీషణుడు కన్నీరు నించుచు.

ఆంజ. విభీషణా నేరికైన జననమరణము గలవు గాన యేల శోకించెదవు లెమ్ము అని లేపును.

ఈ సమాచారంబు దానవులచే మండోదరి విని.

క. పలుమారు తమ ముఖంబులు । 
తల నురములు మోదుకొనుచు దగని 
బుల భూతనభము నిండగ ।
నెలతలు మందోద రపుడు నేడ్చుచు 

ఇటు వచ్చి,

మందోదరి. శోకించును చెలులతో విభునిపై బడి.

మాటలు. అయ్యో నాథా పోతివే యిక మాగతియేమి యిక నిన్నెన్నడు జూతు మకటా.

మందోదరి దర్వు - శోకము - శోకవరాళి.

ఎందుబోతివయ్యోనాథ యేమిసేయుదుహా ముందునాదుగతియు యేమిమోసమాయనే-అకటా॥ యెందు॥ యెంతోనేను దెలియబలుక విననివాడవై । యింతకార్యమునకు బూని యిలనుబడితివే - ఆహా॥ యెందు॥ వైరములవద్దనుచుదెలుప వారిపైకి నీదురములోన గెలువ బోయి శిరములిటుల బోయగా॥ యెందు॥

మాటలు. అయ్యో ప్రాణనాథా హా మనోహరా నను విడనాడి పోతివే గతియేమి దైవమా యని భూమిపైబడి మోదుకొనుచుండ.

రాములు. అమ్మా మందోదరీ నీ వేల చింతించెదవు నీకు స్థిరకాలంబు ముత్తైదువై యుండునటుల వర మొసగితి నిక యేల శోకించెదవు ప్రొద్దుబోవు నిక నగరికి జనుము.

మందో. రామచంద్రా నానాథు నిచటవిడచి నే నెట్లుబోదును.

రాము. ఇచట ఉత్తరక్రియలు దహనము చేయువారలు గలరు గాన నీవీ చెలులతో నిక నగరికి జనుము.



అనగా మెల్లనలేచి చెలులతో శోకించుచు నగరికి జనును.

రాము. విభీషణా యిక ఆలస్యం బేల మీ యన్నకు నీకు సంబంధము లేదు అతడు దివికేగెను గాన జాగ్రతగా యీరాక్షసులతో యీశవమును గొనిపోయి కార్యంబులు నెఱవేర్చిరమ్ము పొమ్ము.

విభీష. చిత్తము అని గొనిపోదురు.

వెంట చెలులు మొదలగు పురజనులతో మందోదరి జనును.

కపులారా యిక జాగ్రతగా విభీషణునికి లంకాభిషేకము జేసి పట్టము గట్టవలెను గాన మీరలందరు సముద్రములకేగి వుదకకలశంబులతో జలంబులు గొనివచ్చి సిద్ధంబుగ యుండుడు.

చిత్తము అని పోయిదెత్తురు.

రాములు. విభీషణా పోయి కార్యములు నెరవేర్చి వచ్చితివా పోయివస్తిని రామచంద్రా.

ఇక నీకు శుభము చేకూరును రావయ్యా.

రాముల - దర్వు - ఇంగ్లీషువర్ణన.

వినువిభీషణా యిక నీ॥ మనసుదీర లంకయేలు మింక నృపతివై॥
యెట్టులైనను యిపుడిక నే॥ గట్టెద పట్టాభిషేకము కపులుజూడగా॥

మాటలు. విభీషణా యిక నీకు రేపు సోమవారం పంచమినాడు ౧౦ గంటలకు యీ లంకాపురి కధిపతిగా పట్టంబు గట్టెద.

విభీషణుడు. చిత్తము రామచంద్రా.

రామ. హే కపులారా యీ సుముహూర్తమున మన విభీషణునికి పట్టంబు గట్టవలె గాన సముద్రోదకంబులు నారికేళ ఖర్జూర కదళి ఫల పుష్పహారంబులు సుగంధద్రవ్యములు దక్షిణ తాంబూలములు హాజరు పఱచినారా.

కపులు. సమస్తము హాజరుపఱచినాము రామచంద్రా.

రామ. బ్రాహ్మణాశీర్వాదంబుగ యీ కొలువుకూటమున గూర్చొనుము విభీషణా చిత్తము.



అనగా భేరీ భాంకార మంగళవాద్య సంగీతంబులచే సుగంధ పుష్పహారములతో కపులారా యీ విభీషణునికి పట్టము గట్టితి మిక మనము యీ పుష్పకవిమానమునందు సీతను దోడుకొని అయోధ్యకు పోవుదము పదండి, చిత్తము అని.

గద్య.

అబ్బరాజువంశపయఃపారావారరాకాసుధాకరుం
డును ప్రథమశాఖకులసత్కవిశేఖరుండును
సుబ్బయామాత్య పుత్రుండును నగు
వేంకటశివకవిచే రచియింపఁబడిన
శ్రీ విభీషణపట్టాభిషేక నాటకము

సంపూర్ణము.

